# అరిగిపోతున్నది వళ్లు!

కష్టించి పనిచేసే ప్రతినిమిషం
ఖర్చవుతుంటుంది
వంట్లో గ్లూకోస్.







అలపు అనగా గ్లూకోస్‌కొఱకు
శరీరము పెట్టు మొఱ.
గ్లాక్సోస్-డి, శుద్ధ గ్లూకోస్
పౌడర్, నిమిషాలమీద
తిరిగి శక్తి కలిగిస్తుంది.

మీ శరీరంలో శక్తిని పుట్టించే మూలధనమే గ్లూకోస. శరీరంలో గ్లూకోస తగ్గినకొలది మీరు బాగా దస్సిపోతారు. అప్పుడే వెంటనే గ్లూకోస పుచ్చుకోండి. తీయగనుండు గ్లాక్సోస్-డి పాలలోగాని, పళ్లరసాలలోగాని, మంచి నీళ్ళలోగాని, లేదా పట్టిగగాని తీసుకోవచ్చు. గుర్తుంచుకోండి, అందరు కోరేది గ్లాక్సోస్-డి యే.

కొన్ని పైసలకే దొరకును తక్షణ శక్తి




## గ్లాక్సోస్-డి

గ్లాక్సో యొక్క గ్లూకోస్ పౌడర్

dCA-GL 4a tel

**He has to read some
45 lengthy reports every day
yet he reads a
NEWSPAPER
every day**



# Which other medium has a standing appointment with highly-paid executives like him, day after day?

Up to his eyebrows in work? No time? Perhaps not for many things. But every important man makes time to read his morning paper. Readership of dailies reaches an optimum 100% for busy men with incomes of Rs. 1000 to Rs. 1500*.

They are all businessmen and professionals who by training have learnt to give their closest and fullest attention to what they read.

So, if it is your advertisement which has come under their scrutiny, you know it is getting their full attention. Your whole sales story is being absorbed. For reading necessarily means seeing with attention!

If your message is in the papers, dailies or periodicals, you know that men who matter to you have read it—in depth.

There is a newspaper or magazine to reach every reader in his language, at the lowest cost per thousand.

*(A S.P. Readership Survey.)

***Address through the Press —it costs far less***

**IENS**

*Inserted in the interest of providing information for better advertising value by*
***THE INDIAN & EASTERN NEWSPAPER SOCIETY***

everest/761a/IENS

# ఉత్తరాలు

పాఠకులకి, రచయిత(త్రు)లకి మా ఉగాది శుభాకాంక్షలు. —సం॥

## కథలు

'ఆత్మార్పణ' కథ చాలా బాగున్నది. కథలో మెలికలు లేకపోయినా, కథాగమనము, వ్రాసిన శైలి, సంభాషణము కడు చక్కగా వర్ణించినారు. చదువుతున్నంతసేపు చదవాలనిపించేటట్లుగా ఉన్నది. ముఖ్యముగా నేటి సమాజంలో జరిగే 'యువతీ యువకుల' సంఘర్షణను చాలా చక్కగా చిత్రించి కథ చివర వరకూ పటుత్వము చేకూర్చినారు. ఇటువంటి కథను వ్రాసిన రచయితకూ ప్రచురించిన మీకు మా హృదయపూర్వక ధన్యవాదాలు. ఇకముందు కూడా ఇలాంటి కథలు ప్రచురించ గలరని భావించుచున్నాను

కె. వి. మధుసూదనరావు (విజయవాడ)

## సినిమా

27—3—70 తేదీ సంచికలో వైజాగ్ నుండి రవిశర్మ గారు 'తల్లా—పెళ్ళామా' చిత్రాన్ని ఆ చిత్రదర్శకుడు యన్. టి. రామారావుగారిని విమర్శిస్తూ వ్రాసిన ఉత్తరం చదివాను. రచయితగా—దర్శకునిగా— యన్. టి. రామారావు ఫెయిల్ అయ్యారని—ఈ చిత్రం వల్ల సమాజానికి హానియే తప్ప మంచి ఏమీ జరగదని వ్రాసారు. రవిశర్మగారు ఆ చిత్రాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేకో లేక వ్యక్తిగతంగా రామారావు గారి ద్వేషి అవడంచేతో, అలా విమర్శించార అనుకుంటాను. ఇక ఈ చిత్రంలో భార్యదేమీ తప్పులేదని వ్రాసారు. ఇది ఘోరం. పద్మ(భార్య) అత్తవారింటికి వచ్చిన కొన్నాళ్ళవరకు అత్తగారితో సఖ్యంగా ఉంటుంది. కాని ఆతరువాత ఇరుగుపొరుగు అమ్మలక్కల సూటిపోటి మాటలు విని— అనవసరంగా ఉన్న, లేనివీ ఊహించుకొని, అత్తగారు— భర్త కూడా తనను నిర్లక్ష్యంగా చూస్తున్నారని —భర్త కూడా తల్లినే ప్రేమగా చూస్తున్నాడని అనుకుంటుంది. పరిస్థితులు కూడా ఆమె ఆలోచనలకు అనుగుణంగా (భర్త, అత్తగారికి డబ్బు ఇవ్వడం లాంటి సన్నివేశం) ఉంటాయి. అందుచేత ఆమె భర్తతో కలహించి, పుట్టింటికి పోతుంది. ఆతరువాత భర్త ఆమె అహంభావాన్ని అణచివేస్తాడు. అప్పుడు ఆమె తన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపం చెందుతుంది. ఈ విధంగా ఈ చిత్రంలో శ్రీ ఎన్. టి. రామారావు గారు మానవుని జీవితంలో భార్యకన్నా తల్లికే ఎక్కువ ప్రాధాన్యత గలదు— అని నిరూపించారు. ఇదే కాక దేశసమైక్యత సన్నివేశాలను కూడా చక్కగా చిత్రీకరించారు. ఇటువంటి ప్రయోజనాత్మకమైన ఈ చిత్రం సమాజానికి ఎలా చెడు చేస్తుందో బోధపడదు. ఒకచిత్రాన్ని విమర్శించేటప్పుడు వ్యక్తిగత ద్వేషాన్ని వదిలి పెట్టాలి. అలా కానప్పుడు అది విమర్శ అనిపించుకోదు. —కె. నరసింహాచార్యులు (బరంపురం)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 10—4—'70
శ్రీ సాధారణనామ సం॥ చైత్రమాసం శు॥ పంచమి
సంపుటము : 63 సంచిక : 30

స్థాపితము:
1908

సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |

## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన : శ్రీ గెనిసెట్టి


చెప్పు, ఎవరు బలవంతుడు
ఎదిరించే మొనగాడు
గుజరాత్ మంత్రివర్గం
సంత
దెబ్బకు దెబ్బ

# పార్టీ ప్రతినిధులా, గవర్నర్లు ప్రభుత్వ ప్రతినిధులా?

గవర్నర్ల చర్యలపై ఈమధ్య ఎక్కువ విమర్శ వినబడుతూ వుంది. ముఖ్యంగా ఈ విమర్శ కమ్యూనిస్టేతర ప్రతిపక్షాల నుంచే కనిపిస్తు వుంది. వారి చట్టసంబంధమైన నిష్పాక్షిక విధానం ఏమిటో మొట్టమొదటి సారిగా రాజస్థాన్‌లోనే గవర్నరు సంపూర్ణానంద్ గారు వ్యక్తపరచారు. ఆయన ఆ విధానాన్ని కాంగ్రెసుకు అనుకూలంగా తీర్చిదిద్ది వుండకపోయినట్లయితే సుఖాడియాగారు రాజస్థాన్‌కి ముఖ్యమంత్రిగా నిలవగల్గేవారు కారు.

ఇదే పద్ధతిని ధర్మవీరాగారు పశ్చిమబెంగాల్‌లో అవలంబించారు. ధర్మవీర యోగ్యుడైన వ్యక్తి. ఆయనకి అక్కడ స్థానం లేకపోయింది. కాళ్లు కాల్చుకుని ఢిల్లీకి పరుగెత్తుకొచ్చారు. సురక్షితమైన ప్రదేశం మైసూరు చేరే వరకు ఆయనకు ఆ మంట తగ్గలేదు. ఇక్కడ ఒక విషయం చెప్పాలి. ఘనత వహించిన కమ్యూనిస్టు పార్టీ—ఆపార్టీ పత్రికలూ ధర్మవీరగారిని ఏకి పారేశాయి. బెంగాలుకి తిరిగి రమ్మని కూడా పోరాడాయి! అది వేరేమాట!

ఇది అంతా కాంగ్రెసు విభజన జరక్క ముందు జరిగింది. అప్పటి నుంచి కాంగ్రెసును 'ఇందిరీయం' చెయ్యాలని రభస జరుగుతోంది. పారిశుధ్య కార్యక్రమానికి ఉత్తరప్రదేశ్‌లో విజయం లభించింది. అక్కడ చరణ్ సింగ్ గారి ఆధిపత్యంలో బి. కె. డి. ప్రభుత్వం నెలకొల్పబడింది. బీహారు మంత్రివర్గం కూడా మార్పుకు లోనయ్యింది.

## ధవాన్‌గారి దక్షత

ఉత్తరప్రదేశ్‌లో రెడ్డిగారు, బీహారులో కనుంగో పార్లమెంటులో కమ్యూనిస్టేతర ప్రతిపక్షం వారి విమర్శలకు గురి అయ్యారు. ఆ గాలి ధవాన్‌గారి మీదకు కూడా సోకింది. ధవాన్‌గారు తనకు తానుగా చాలా గౌరవాన్ని సంపాదించుకున్నారు. గవర్నరు కాగానే కమ్యూనిస్టుల గుణగణాల్ని ప్రశంసించారు. అంతతో ఆయనకి భారతీయులందరి కంటె ఎక్కువ ఘనత వచ్చేసింది. ముఖ్యంగా కాంగ్రెసు నాయకుల్లోనే గొప్పవాడనిపించుకున్నారు. ఈ రాద్ధాంతంలో పశ్చిమబెంగాల్‌లోని అమాయిక ప్రజలు, స్త్రీలు, పిల్లలు భయకంపితులై పోయారు, అనేక చిత్రహింసలకు గురి అయ్యారు. 1970 నుంచి ఎంతోమంది కలకత్తా విడిచి వెళ్లిపోవడం జరుగుతోంది! అప్పుడు ఈ ఘనత వహించిన గవర్నరు గారు చెయ్యవలసిందేమిటి? చేసిందేమిటి? వెంటనే జ్యోతిబాసు గార్ని పిలిచి ప్రభుత్వం ఏర్పరచమన్నారు. బాసుగారు ఆయన మాటని శిరసావహించలేక పోయారు. ఫలితంగా పశ్చిమబెంగాల్‌లో గవర్నరుగారు ఒక ప్రకటన చేశారు! 'యునైటెడ్ ఫ్రంట్‌ని నిలపడానికే రాష్ట్రపతి పాలన' అన్నారాయన! కమ్యూనిస్టేతర సభ్యులు ధవాన్‌గార్ని వెంటనే తొలగించాలని లోక్‌సభలో పట్టుపట్టారు. ఆయన్ని ఒక రాజకీయ సమస్యగాను, బాధ్యత తెలియని వ్యక్తిగాను చూపించారు.

వాజ్‌పాయ్‌గారు ఈ సభ్యులను రెచ్చగొట్టడానికి తోడ్పడ్డారు. గవర్నరు గారు ఉపయోగించిన బెదిరింపు భాషని దృష్టికి తీసుకువచ్చి ఆయన ఉత్తరాలని ఉదహరణంగా చూపించారు మధులిమాయే గారు.

## గవర్నర్ల చర్య?

చవాన్ గారు మామూలుగా గవర్నరు గారినే సమర్థించారు! కాని, ఒక విషయం చెప్పకపోలేదు, గవర్నరు అలాంటి ఉత్తరాలు రాయవలసినంత అవసరం లేద అని అన్నారాయన. ధవాన్ గారికి వచ్చిన విషమ పరిస్థితి ఎవరికయినా తటస్థించినట్టయితే అప్పుడు గవర్నర్ని నోరు మెదపకుండా వూరుకోవటమే ఉత్తమమని ఆయన తేల్చారు. రాష్ట్రపతి పాలన రాగానే గవర్నరు చేసిన ఉపన్యాసాన్ని కూడా చవాన్‌గారు విపరీత ధోరణిలో అర్థం చేసుకున్నారు!

గవర్నర్లకి ప్రభుత్వానికి గల దగ్గర సంబంధాన్ని వ్యక్తం చెయ్యడానికి చవాన్‌గారు చాలా శ్రమ పడ్డారు. యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం పడిపోయిందీ అంటే అందుకు బాధ్యత గవర్నరుది కాదని, గవర్నరు ప్రభుత్వం ప్రతినిధే గాని యునైటెడ్ ఫ్రంట్ ప్రతినిధి కాదని, అలాంటప్పుడు గవర్నరు బాధ్యతారహితంగా వ్యవహరించారూ అంటే అది నమ్మశక్యమైన విషయం కాదని చవాన్‌గారి వాదన.



తమిళనాడునుంచి రాజ్యసభకి పోటీచేసి ఓడిపోయిన శ్రీ పి. సుబ్రహ్మణ్యం,

## ధవాన్ ఎవరి ప్రతినిధి?

గవర్నరు ఎవరికీ ఎలాటి సంఘటనలకీ లొంగి వుండలేదన్న చవాన్‌గారి మాటలని వాజ్‌పాయ్, సమరేంద్రకుందు, బెనిశంకర్ శర్మ లాంటి వాళ్లు ఎదిరించారు. వారు, రాజకీయాల్ని తారుమారు చేసిన ధవాన్ గార్ని మళ్లీ మళ్లీ ఆడిపోశారు. గవర్నరు ప్రసంగాన్ని దృష్టికి తెస్తూ అది నిభేదాన్ని ఎలా సృష్టించిందో విశదం చేశారు. ఒకసారి ధవాన్‌గారు హైకమీషనర్ పదవిలో లండన్‌లో చేసిన ఒక ప్రసంగ సారాంశాన్ని చెప్పారు వాజ్‌పాయ్. ఆ ప్రసంగంలో ధవాన్‌గారు 'యునైటెడ్ ఫ్రంట్ భారతదేశం భవిష్యత్ రాజకీయాల్లో ప్రముఖస్థానం వహిస్తున్నారట.' ఇలా చెప్పినట్లు తెలిసింది.

వాజ్‌పాయ్ లాంటి వ్యక్తులకి వాక్స్వాతంత్రం ఇవ్వాలని, వ్యక్తిగత అభిప్రాయాలని వ్యక్తం చేసుకోడానికి పూర్తి స్వాతంత్ర్యం ఇవ్వాలని వాజ్‌పాయ్ అన్నారు. గవర్నరుగా అలాంటిది సాధ్యంకాదని అంచేత ఆయన్ని గవర్నరు పదవి నుంచి తొలగిస్తూ స్వేచ్ఛాస్వాతంత్రం ప్రసాదించాలని వాజ్‌పాయ్ కోరారు!

వేర్వేరు రాజకీయ పార్టీలకు ఉత్తరాలు రాసిన ధవాన్ గారి పద్ధతిని విమర్శిస్తూ మధులిమాయే ఆయన మీద అభియోగం తీసుకువచ్చారు. జ్యోతిబాసును సమర్థించము అని అన్నిపార్టీలు ముందుగా గవర్నరుకు విన్నవించి వున్నట్టు తెలిసింది. అయినా రెండు ఉత్తరాల వల్ల దాన్ని అసలు పరచాలని చూశారు. ఆయన ఉత్తరాల సారాంశం పూర్తిగా కారణాలు తెలపమని సంజాయిషీ అడిగినట్టుగా,

అది కోర్సువారు అడిగే పద్ధతిలో అడిగినట్టుగా వున్నట్టు చెప్పారు.

### ఏది సబబు ?

పదవి నుంచి విరమించుకొంటున్న ముఖ్యమంత్రి గారు రాష్ట్రపతి పాలన మేలయిన పద్ధతి అని అంగీకరిస్తుండగా, ప్రభుత్వ ప్రతినిధిగా గవర్నరు గారు రాష్ట్రపతి పాలన అంత సముఖమైనది కాదని వర్ణించడంలో అర్థంలేదని నాథ్ పాయ్ తీవ్రంగా విమర్శించారు.

ఈ గొడవల వల్ల గవర్నర్ల పాత్ర ఏమిటో చర్చనీయాంశంగా తయారైంది. దీనికి కారకులయిన ధవాన్‌గారు ప్రభుత్వ ప్రతినిధిగా కాకుండా యునైటెడ్‌ఫ్రంట్‌ని సమర్థించే వ్యక్తిగా—జ్యోతి బాసుకు మద్దతు నిచ్చే వ్యక్తిగా యారవడం వల్ల అసలు గవర్నర్లు వుండాలా? అక్కర్లేదా? అన్న ప్రశ్న కూడా వచ్చిపడింది. పశ్చిమబెంగాల్‌లో పోలీసులు నీతినియమాలకు దూరంగా పోతున్నారు. చైనా మార్క్సు కమ్యూనిస్టులకి చవాన్‌గారు ప్రోత్సాహాన్నిస్తున్నట్టుగా వుంది వ్యవహారం చూస్తూ వుంటే. పశ్చిమబెంగాల్‌లో సమస్య ఒక్క శాంతిభద్రతల్ని కాపాడటమే కాదు, ప్రాణాలను రక్షించడం కూడా! కనీసం ప్రాణాలతోనన్నా వుండనిస్తే చవాన్‌గారు పుణ్యం కట్టుకుంటారు! అరాచకాన్ని రూపుమాపాలని పోలీసలు ప్రయత్నం చేసినా ఫలితం ఏమిటి? గవర్నరు గారేమో జ్యోతి బాసు— ఆయన బలాన్ని ప్రోత్సహిస్తున్నారాయె! అటువంటప్పుడు ఎవరిని అని ప్రయోజనం వుండదు!

### 'సర్వం ఇందిరీయం'

అదే విధంగా, ఒకప్రక్క సర్వం 'ఇందిరీయం' చెయ్యాలనే ఉద్యమం ఒకటుంది. ఒరిస్సా ముఖ్యమంత్రి ఆర్.ఎన్. సింగ్‌దేవ్ గారు కేంద్రమంత్రులు తమ రాష్ట్రానికి వస్తున్నారంటే నిరసన తెలియపరిచారు. వస్తే ఏమవుతుందో ఆయనకు బాగా తెలుసు. ప్రభుత్వం తల్లక్రిందులైపోతుంది. తమ బలాన్ని నిరూపించుకోడానికి ప్రతిపక్షానికి అధికారం వుందని, అనవసరంగా కేంద్రమంత్రులు కలిగించుకుని ప్రభుత్వాన్ని పడగొట్టడం అంత శ్రేయస్కరమైన విషయం కాదని ఆయన అన్నారు.

సంఘటిత ప్రభుత్వాని 140 లోను 68 బలం వున్నది. పార్టీ బదలాయింపుల తర్వాత ఎవరూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వోటు చెయ్యలేదని సింగ్‌దేవ్ గారన్నారు. ప్రభుత్వం బెంచీల నుంచీ దిగిపోయిన ఎనమండుగురిలోను ఇద్దరు వెనక్కి తిరిగి వచ్చేశారు. మూడో అతను సిద్ధంగా వున్నాడు. మరికొందరు మళ్ళీ తిరిగి రావడానికి ఆలోచిస్తున్నారు.

ఇండిపెండెంట్ల నుంచి, కాంగ్రెస్ గ్రూప్‌లో ఒక భాగం నుంచి కొంత బలం వస్తుందని ఆయన ఆశాభావం. అంతేకాని విచ్ఛిత్తి వుండదని ఖచ్చితంగా చెప్పారు. ఇంత క్లిష్ట పరిస్థితిలో కూడా నిలబడగల్గినందుకు బిజూ పట్నాయక్ ఫోన్ చేసి అభినందనలు తెల్పినట్టు శ్రీ సింగ్‌దేవ్ చెప్పారు.

### ఈ డబ్బు ఎక్కడనుంచి వచ్చింది ?

ప్రభుత్వాన్ని చిన్నాభిన్నం చెయ్యాలని చాలా డబ్బు ఖర్చు పెట్టారు. కాని, ఆ డబ్బంతా ఎక్కడ నుంచి వచ్చిందో తెలియదని ఆయన అన్నారు.

ఇందిరాగాంధి పక్షం కాని కాంగ్రెసు ప్రభుత్వాల్ని పడగొట్టాలనే ఉద్యమం ఇక్కడ కొంతవరకు దెబ్బతింది అనే చెప్పాలి. 'సర్వం ఇందిరీయం' ఉద్యమంలో ఇదొక మెట్టు. నిలకడయిన, శుభమైన బలమైన ఒరిస్సా ప్రభుత్వం కేంద్రానికి కొంత కంటగింపుగానే వుండొచ్చు అన్నారాయన.

గుజరాత్‌లో స్వతంత్రపార్టీ గురించి బాబూజగ్‌జీవన్‌రాం వ్యాఖ్యానం వినతగిందే. ఆయన వ్యాఖ్యానం వల్ల ఒక విషయం విశదమవుతుంది. గుజరాత్‌లో కాంగ్రెసు ప్రభుత్వం సుఖంగా లేదు! 'ఇందిరీయం' కాని ఏ ప్రభుత్వమూ సుఖంగా వుండలేదని ఆయన భావం! డి. ఎం. కె. మీద ఎలాంటి గొడవా లేదు. పశ్చిమబెంగాల్‌లోని యునైటెడ్‌ఫ్రంట్ ప్రభుత్వం మీదా ఎలాంటి అభియోగమూ లేదు. డి. ఎం. కె. ప్రభుత్వం 'ఇందిరీయమే.' అలానే పశ్చిమబెంగాల్‌లో జ్యోతిబాసు ప్రభుత్వం కూడా!

పార్లమెంటులో లాబీవర్గాల వల్ల తెలుస్తున్న దేమిటి అంటే సుబ్రహ్మణ్యం సభ్యత్వం పైన డి. ఎం. కె. ప్రభావం చాలా వుందని. డి. ఎం. కె. ఆయనకి ఎదురు చెప్పడంలేదు మాడమ్ గాంధి ధానం లాగే తటస్థంగా వుంది అంటే అర్థం అదే! సుబ్రహ్మణ్యం సభ్యత్వంపై ముఖ్యమంత్రి చేసిన ప్రకటనే ఇందుకు ఉదాహరణ.

ఈ నెలాఖరున రాజ్యసభ ఎన్నికలు మాడమ్ ఇందిరాగాంధి కాంగ్రెసుకు గొప్ప విజయాన్ని సంపాయించి పెడతాయని భావించ నవసరంలెదు. రెండు వర్గాలకీ బాగా మర్యాద జరుగుతుందనే ఆశించవచ్చు.

—శ్రీ కృష్ణ

డాక్టర కబుర్లు

## కొవ్వుని తీసి వెయ్యటం ఎలాగ?

మీకే పెద్దిపొట్ట ఉందనుకోండి, లావుపాటి వారనుకోండి, ఉదర శస్త్ర చికిత్స చేయించుకుంటున్నారనుకోండి—డాక్టరుని అనవసరమయిన కొవ్వుని కొంతతీసివెయ్యగలడేమో అడగండి. ఇది ఒక కొత్తరకమయిన పద్ధతి అనుకోవచ్చు కొందరు. కాని, ఇది పాతపద్ధతే! 1899 లో 285 పవున్ల బరువుకల వనిత సరిగ్గా నడవలేక పోవటం చూసి డాక్టరు ఆమె దేహంలో అదనపు కొవ్వు చాలా తీసివేశాడు.

లావుపాటి ఆడవారు సన్నబడిన తర్వాత వారి ఉదరభాగం ముడతలుపడి చూడటానికి బాగా ఉండక పోవచ్చు.

ఇది ఆడవారి మానసిక పరిస్థితికి కూడా కీడు కలిగించవచ్చు. దీనికి ఆపరేషన్ పిలవుతుంది. ఇది ప్రమాదకరమయిన ఆపరేషన్ కాదుకాని చిన్న ఆపరేషన్ మాత్రం కాదు.



జాగ్రత్తగా చెయ్యాలి.

సాధారణంగా ఒకసారి 'పోయిన' కొవ్వు తిరిగిరాదని డాక్టర్లు అంటారు.

(కాపీరయిటు)

# కంచిలోని కైలాసనాథ దేవాలయం

ఫొటోలు, వ్యాసం: ఎస్. రామకృష్ణ



50 అడుగుల ఎత్తు ఉన్న విమానం.

కంచిలోని కైలాసనాథ దేవాలయాన్ని పల్లవరాజసింహ (నరసింహవర్మ) రాజా కట్టించాడు. ఇది మహాబలిపురం 'తీర దేవాలయం' కన్నా పెద్దది, విమానం కలది. గుడిలోని శాసనాలవల్ల మనం మరొక విషయం తెలుసుకొనవచ్చు! అది, ఈ ఆలయాన్ని రాజసింహ రాజా కట్టించాడు, దానిని అతనికొడుకు మూడవ మహేంద్రవర్మ పూర్తిచేశాడు.

గర్భగృహం చుట్టూ 9 చిన్న దేవ మందిరాలు ఉన్నాయి. గర్భగుడి వెనుక గోడమీద 'సోమస్కంద' కుడ్యం ఒకటి ఉంది. చిన్న మందిరాలు శివలీలా మూర్తులకి సంబంధించినవి...

విమానం ఎత్తు సుమారు 50 అడుగులు. దీనికి 3 అంచలు ఉన్నాయి. స్తంభాలమీద పల్లవ చిహ్నలయిన సింహాలు చెక్కి ఉన్నాయి...

ఈ సింహాలేకాక, ద్వారపాలకులు (కిరీటాలు కలవారు) వినాయకుడు (ఇరువయిపులా సింహాలూ, మకరాలు—రౌతులూ) శిల్పాలలో కనిపిస్తారు. ఇతర శిల్పాలు చాలా ఉన్నాయి.

ఆలయ ప్రథమద్వారం వద్ద నంది విగ్రహంకూడా చూడవచ్చు. ఈ ప్రదేశంలో ఒకప్పుడు మంటపం ఒకటి ఉండి ఉండాలి కాని ఇప్పుడు దాని శిథిలావశేషాలు మాత్రమే కనిపిస్తాయి.

గుడి క్రీ. శ. 674 నుంచి 800 దాకా కట్టారంటారు. గుడిలోపలి శివలింగం 6 అడుగుల ఎత్తు కలది.

కైలాసనాథ దేవాలయం పల్లవ రాజవంశం పరిపాలనలో గుడి కట్టడం ఎంత అభివృద్ధి అయిందో తెలుపుతుంది.



చిన్న దేవమందిరాలలో ఉన్న దుర్గ విగ్రహం. స్తంభాలపై దూకుతున్నట్లు ఉన్న సింహాలనికూడా చూడవచ్చు.



పల్లవరాజులనాటి శిల్పకళావైభవాన్ని చాటే నంది.

# సాధారణ కార్యములు



# తెలుగువారి తొలి పండుగ

ప్రతి సంవత్సరమూ తెలుగువారు జరుపుకునే పండుగల్లో తొలిపండుగ ఉగాది. దీన్నే సంవత్సరాది పండుగ అంటారు. దీనితోటే సంవత్సరం ప్రారంభం కావడం దీనికి కారణం.

ఉగాది అంటే సంవత్సరాది అని వాడుకలో ప్రసిద్ధంగా ఉన్నది. కాని 'యుగాది' అనే పదంనుంచే 'ఉగాది' వచ్చిందని అనుకోవడం సబబుగా తోస్తుంది. మన పెద్దల వాక్కును అనుసరించి అదే ఉచితంగా కూడా కనబడుతుంది.

యుగాల్లో కృతయుగం మొదటిది. అనంతమైన కాలాన్ని కొలవడానికి యుగాలనూ, సంవత్సరాలనూ, మాసాలూ పక్షాలూ దినాలు మున్నగువాటిని ఏర్పరుచుకోవడం జరిగింది. మాసాల్లో చైత్రమాసమూ, పక్షాల్లో శుక్లపక్షమూ, తిథుల్లో ప్రతిపత్తూ మొదటివిగా నిర్ణీతాలయాయి. ఈ రీతిని ఆరంభంలో చైత్ర శుక్ల పాడ్యమినాడు బ్రహ్మ సృష్టిని ప్రారంభించినట్లు తెలుస్తున్నది.

మానవుని జీవితంలో కొంతకాలం జరిగిన తర్వాత, తన పద్ధతిని సింహావలోకనం చేసి, పురోగమనానికి పథకాలు వేసుకోవడం, పాతవాటిని పరిత్యజించడం పరిపాటి. పాత ఆలోచనలకు స్వస్తి చెప్పి, కొత్త ఆలోచనలకు పూనుకోవడం కూడా జరుగుతుంది. మానసికంగానే కాకుండా శారీరకంగాకూడా నూతనత్వాన్ని ఆపాదించుకొనుటకు అభ్యంగస్నానం చెయ్యడం, నూతన వస్త్రాలు ధరించడం, మానసోల్లాసానికి పిండివంటలతో భుజించడం, వెనుకటి దుఃఖాలను విస్మరించి, సంతోషంకోసమే సర్వవిధాలా ప్రయత్నించడం ఇప్పుడు జరుగుతుంది. తమ భావి జీవిత నౌకకు చుక్కానివంటి పంచాంగ శ్రవణానికి అందరూ కుతూహల పడుతూ ఉంటారు. ఇట్టి పర్యవేక్షణకు ఒక కాల పరిమితి ఏర్పడడం—క్రమంగా అదే ఆచారంగా మారడం జరిగింది. అందువల్లనే సంవత్సరాది సాంప్రదాయికమైన పర్వమయింది.

యుగమంటే కృతయుగాదికమే అనుకోరాదు. అదికూడా ఒక స్వల్పకాల పరిమితికి సంజ్ఞగా మారిపోయింది. తెలుగునాట ఈ మార్పు బాగా ప్రచారంలోకి వచ్చింది. నన్నయ యుగం, తిక్కన యుగం, రాయల యుగం— మొదలైనవి దీనికి తార్కాణాలు.

ప్రకృతి పరిణామాలను బట్టీ, ప్రజల జీవన విధానాన్నిబట్టీ, పంటలను బట్టీ ఉగాదులు మారుతూ వచ్చాయి. ఒకపంట కారుకు, మరొక పంటకారుకు మధ్య వుండేకాలం సంవత్సరంగానూ, పంట కారు సంవత్సరాదిగానూ ఒకప్పుడు ఉండేదిట ! ఈ రీతిగా క్రమేణా ఉగాదులు మారుతూ వచ్చాయి. కార్తిక శుద్ధ నవమి కృతయుగాది అనీ, వైశాఖశుద్ధ తృతీయ త్రేతాయుగాది అనీ మాఘ బహుళ అమావాస్య ద్వాపరయుగాది అనీ, భాద్రపద బహుళ త్రయోదశి కలియుగాది అనీ భవిష్య పురాణంలో ఉన్నది. దీనిని బట్టి వత్సరాదిని జరపడంలో వైవిధ్యం వ్యక్తమవుతున్నది.

దక్షిణ భారతదేశంలో చాంద్రమానం, సౌరమానం బహుళ వ్యాప్తిలో ఉన్నవి. శుక్లపాడ్యమి మొదలు అమావాస్యవరకూ వుండేది చాంద్రమానపు మాసం. సంక్రాంతి మొదలు సంక్రాంతివరకూ ఉండేది సౌరమాన మాసం. చాంద్రమానం ప్రకారం ఉగాదిని ఆంధ్రులూ, కన్నడులూ, మహారాష్ట్రులూ పాటిస్తారు. తమిళులు సౌరమానాన్ని అనుసరిస్తారు. కృష్ణపక్షంతో ప్రారంభమై శుక్లపక్షంతో ముగిసే నెలకూడా ఉన్నది. అది వింధ్యకు ఉత్తరప్రాంతాన్నే గాని, దక్షిణ ప్రాంతంలో పరిగణించబడదు. అది బార్హస్పత్య మానానికి సంబంధించింది. ఉగాదికి పితృదేవతలతో సంబంధం ఉన్నది. ఆంధ్రులు దీన్ని ముఖ్యమైన పండుగగ భావిస్తారు. ఆర్యావర్తంలో దీనికి ఎక్కువ ప్రాముఖ్యం ఉన్నట్లు కానరాదు.

క్రైస్తవులు ఉగాదిని జనవరిలో జరుపుకుంటారు. కారణం ఏమంటే — జనవరినాటికి సూర్యుడు మకరరాశిలో ప్రవేశిస్తాడు, అంతవరకూ మంచు ముసు



## '70 ఏప్రిల్ విడుదలలు

# ఎమెస్కో ప్రచురణలు




## ఇంటింట సరస్వతీ పీఠం

ఎమెస్కో సంప్రదాయ సాహితీ పరంపర
ప్రాచీన మహాకావ్యాల ఎమెస్కో ప్రచురణలు
ఆధునిక యువతీ యువకుల సంప్రదాయ
సాహిత్యాభిరుచి పునరుజ్జీవనానికి




విస్తృత
దోహదానికి
నూతన
ప్రణాళిక

## ఉగాదికి శుభారంభం

ఆంధ్ర కవితాపితామహుడు
అల్లసాని పెద్దనామాత్యుని

# మనుచరిత్రము

విద్వాన్ రావూరి దొరసామిశర్మ వారి పరిష్కరణతో
కవిసమ్రాట్ విశ్వనాథ వారి
కమనీయ పీఠికతో
సాదాప్రతి రూ.2/- మేలిప్రతి రూ.3-75

పుస్తక విక్రేతలకు ఆకర్షణీయమైన టరమ్సు
వివరాలకు వ్రాయండి

## ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

రాష్ట్రపతి రోడ్. సికింద్రాబాద్




114. (శ్రీ) నీతి చంద్రిక

రావి కొండలరావు
తెలుగు చలచ్చిత్ర ప్రపంచ
హితోపదేశం




115. దయ్యాలు లేవ్వా?

..లత..

కామినీ కాముక పిశాచాల నవల.




116. ఊబిలో దున్న

వినుకొండ నాగరాజు
గూఢార్థస్ఫురణల సాంకేతిక
నవల.




117. రాజరాజు

(శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి)
నన్నయభట్టు ధర్మజ్యోతితో
ధగధగలాడే నాటకం.

ఎమెస్కో పాకెట్ బుక్స్ బుక్ షాపుల్లోనూ న్యూస్ ఏజంట్ల వద్దా దొరుకుతాయి. లేదా తిన్నగా మాకు రాయండి. ప్రతి నెలా విడుదలయే నాలుగూ ఒకసారి తెప్పించుకుంటే పోస్టేజి ఉచితం. ఎనిమిది రూపాయలూ ముందే మనియార్డరు కట్టాలి. విడిగా ప్రతులు కావాలంటే ఒకో ప్రతికి రెండు రూపాయలూ, అదనంగా పావలా పోస్టేజి చేర్చి ముందే మనియార్డరు చెయ్యాలి. రిజిస్టరు పోస్టయితే ప్యాకెట్టుకి 95 పైసలు అదనం *

ఎమెస్కో వారు ఇంతవరకూ మీ అభిమాన రచయితల రచనలు 117 ప్రచురించారు. పూర్తి లిస్టు ప్రతి ఎమెస్కో పాకెట్ బుక్ చివరి పేజీల్లో వుంటుంది. మూడు రంగుల ముచ్చటైన ముఖచిత్రం ప్రతి నెల రెండేసి రంగుల...

గులో ఉన్న ప్రకృతి, దాన్ని తొలగించుకుని తొంగిచూస్తుంది. నూతన జీవితం ప్రారంభ మవుతుంది.

అగ్నిపూజకులైన పార్శీలకు 'నౌరోజ్' సంవత్సరాది. అది 'నూతన దినం' అనే అభిప్రాయాన్ని సూచిస్తున్నదేమో! అది మన ఉగాదికి దరిదాపుల్లోనే వస్తూ ఉంటుంది. చాంద్రమాన సంవత్సరాదిని గురించి ఔరంగజేబు పాదుషా తన కుమారుడు మొఅజ్జమ్‌కు వ్రాస్తూ, అది హిందువులకు ప్రధానమైన పండుగ అనీ, పారశీకులకుకూడా అది పండుగనీ, విక్రమాదిత్య చక్రవర్తి రాజ్యాభిషేకదినం ఇదే అని హిందువుల నమ్మకమనీ తెలియజేశాడట!

ముస్లిములు చంద్రుని గమనాన్ని అనుసరించి దీన్ని ఆచరిస్తూ ఉంటారు. అధికమాసాలు వారికి లేవు. అందువల్ల

## తెలుగువారి...

వారి ఉగాది ఒకప్పుడు చైత్రంలోనూ, మరొకప్పుడు వైశాఖంలోనూ — ఈ విధంగా నెలలు మారుతూ వస్తూ వుంటుంది. ఫలానారోజు అనే స్థిరత లేదు.

రాజులను అనుసరించి మానాలకు ప్రాధాన్యం వస్తుంది. మనకు చాంద్రమానమే ప్రధానంగా ఉండినా, చాళుక్యుల కాలంలో—వారి ఆదరం మూలంగా సౌరమానం విశేష వ్యాప్తికి వచ్చింది. ఇప్పుడు అది మనకు ప్రధానం కాదు. కాని తమిళనాడులోనూ, కేరళం, బెంగాలు, పంజాబు రాష్ట్రాల్లోనూ దానికే ప్రాధాన్యం ఉన్నది. అసోంవాసులుకూడా దీనినే పాటిస్తారు.

బార్హస్పత్య మానాన్ని గుజరాతీలూ, మార్వాడీలూ పాటిస్తున్నారు. నిర్ణయసింధుకారుడు 'బార్హస్పత్యస్తు మాఘాదౌ' అని చెప్పి ఉన్నాడు. ఆ నిర్ణయాన్ని అనుసరించి బార్హస్పత్య సంవత్సరాది మాఘ శుద్ధ పాడ్యమితో ప్రారంభమవుతుంది. కాని జైన సంప్రదాయానికి చెందిన మార్వాడీలు దీపావళి నుంచి నూతన సంవత్సరంగా భావించి, ఆ రీతిగా పండుగ జరుపుకుంటున్నారు. వీరి వృత్తి ముఖ్యంగా వ్యాపారం. అందువల్ల వ్యాపారంచేసే గుజరాతీలూ, మార్వాడీలూ అందరూ కాలక్రమంగా ఈ పద్ధతినే పాటించసాగినారు. ఇప్పుడు జాతి మత భేదం లేకుండా వారందరికీ అదే ఉగాది అయింది.

ఏ పంట పండినా—దాన్ని కొత్త సంవత్సరం ప్రారంభమయితేకాని వాడకుండా ఉండడం పూర్వం ఒక పద్ధతిగా ఉండినట్లు కానవస్తుంది. ఉగాదినాడే దాన్ని ఉపయోగించడం ప్రారంభమవుతుంది. ఈ సంప్రదాయం విషయంలో గిరిజనులు — కోదులు మున్నగు జాతులవారు ఎంతో పట్టుదలను చూపిస్తారు. ఉగాది నాడు మనం చవిచూచే ఉగాది పచ్చడి ఈ ప్రాచీన సంప్రదాయానికి సూచకంగా ఉన్నది. మామిడిపిందెలు మాఘమాసం నుంచీ లభ్యమవుతున్నా కొందరు నియమవంతులు వాటిని ఉగాదినాడుగాని రుచి చూడరు. కొత్త చింతపండు, కొత్త బెల్లంల వాడుక ఆనాటితోనే ప్రారంభమవుతుంది.

ఈ నూతనాబ్దం అందరికీ శుభావహం కావలెనంటూ వెనక శ్రీ సెట్టి లక్ష్మీనరసింహంగారు వ్రాసిన—

'క్రొత్త సంవత్సరమ్ము మీకున్
ద్వదాప్త
జనులకు శుభప్రదంబయి జరుగుంగాక!
ఇట్టి సంవత్సరమ్ము లనేకము లిటు
మీఁద మీకు గల్గును పరమేశు కరుణ.'

అనే గీతాన్ని స్మృతిపథానికి తెచ్చుకోవడం అప్రస్తుతం కాదు.

—ఆంగీరస

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## అజాగ్రత్తకి 26 మంది ఆహుతి

బస్సు పెట్రోలు పోసుకుంటుండగా ఒక అధునాతన ప్రయాణికుడు దిలాసాగా సిగరెట్టు వెలిగించి విలాసంగా ఆ పీక అటు విసిరినందువల్ల అది పెట్రోలులోపడి మొత్తం బస్సంతా దగ్ధమై ఆయనతో సహా 26 మందిని తగులబెట్టేసిందట—మన అజాగ్రత్తవల్ల మనకే నష్టం అనుకో కూడదు—

## లూప్ ప్రమాదాలు!

భోపాల్లో ఒక గర్భిణి స్త్రీ కుటుంబ నియంత్రణాలయంలో లూపు వేయించుకుందట. ఆలూపు వేయించుకున్న కారణంగా ఆమె నిండు ప్రాణం పోయిందట. ఈ విషయం మధ్యప్రదేశ్ ఎసెంబ్లీలో చర్చకువచ్చినపుడు ఆరోగ్యమంత్రి దేవ్‌సింగ్ ఇది కుటుంబ నియంత్రణశాఖ అశ్రద్ధవల్లకానే




కాదన్నారట. ఆమె తన స్థితిని తనే తెలుసుకొని స్థితిలో ఆ లూపు వేయించుకున్నందువల్ల మరణం సంభవించిందన్నారట ఆయన. మన స్థితులు మనకి తెలియకపోతే—ఆ స్థితులు డాక్టర్లకయినా తెలీవా? వాళ్ళు చెప్పొద్దూ—ఏమైనా కుటుంబ నియంత్రణాల్లో యీ లూపు లైనులు కొంచెం ప్రమాదం గానే ఉన్నట్టున్నాయి.

*　　*　　*

పేరణాంపట్టు అనే వూళ్ళో 29 ఏళ్ల నటరాజన్ అనే అతను తన సొంతానికి కనీసం కాస్త భూమినయినా కొనుక్కోవాలని ఆశపడి, తన ఆశ నెరవేరడానికి తనవద్ద ధనం లేనందువల్ల మనస్సు విరిగి, జీవితంమీద రోత పుట్టి పాలిటాల్ అనే విషం త్రాగి మరణించాడట. ఈయనకు భార్యా, ఒక కొడుకూ ఉన్నారట—ఆశకి అర్హత చూసుకోవా లన్నారు.

*　　*　　*

## డెన్మార్క్‌లో ఎ(సె)క్సిబిషన్

డెన్మార్క్‌లో వో రసభరితమైన ఎగ్జిబిషన్ జరిగిందట. దీని పేరు సెక్సిబిషనన్నారు. అనగా ఆడామగా అచ్చోట నగ్నంగా యదేచ్ఛగా సంచరిప్పవచ్చునట. ఈ ఎగ్జిబిషనులో వో నగ్నసుందరి ఎలుగెత్తి 'కమాన్ యువతీ యువకులారా. నగ్నంగా రండి. మీ యిష్టం వచ్చినట్టిక్కడ గడపండి అడ్డేమీలేదు యస్.....నో..' అందట. ఆ హెచ్చరికతో వుషారున్నవారు, అది తెచ్చిపెట్టుకో గలిగినవారు చెంగున నగ్నంగా తయారై ఎగిరి గంతేశారుటక్కడికి. ఉషారున్నా ధైర్యంలేనివారు కనీసం చూడనైనా చూద్దామని కళ్ళు పెద్దవి చేసుకుంటూ గుమిగూడారట. మరోచోట స్విమ్మింగ్ పూల్ (ఈత కొట్టే పెద్ద తొట్టి) లో ఆడా మగా నగ్నంగా జలకాలాడేవసతి కల్పించారట. ఇంతేగాక బ్లూ ఫిలిమ్స్ (బూతు చిత్రాలు) బూతు బొమ్మలూ స్లైడులు విపరీతంగా ప్రదర్శించారట. కొంత మంది మాత్రం డెన్మార్క్ యీ వాతావరణాన్ని ఏవగించుకుంటూ యీ ఎగ్జిబిషన్ని 'డెన్మార్క్ బూతుగాలుల్లో కల్లో—యిది పెద్ద గాలి, పుయ్ పీన్ తుఫానువంటిది. ఛీ పాడూ యాక్కురారి అంటున్నారట—అహో .. హౌ ఉయ్ విష్ టు బి ఇన్ డెన్మార్క్—కీప్ క్వయిట్




## కుటుంబ కలహాలు

చిత్తూరుకు చెందిన గొల్లపల్లి అనే వూళ్లో శ్రీనివాసులునాయుడు అనే ఆయన భార్య ఆసందమ్మ కుటుంబ కలహాలతో తన జీవితాన్ని నెట్ట లేక, తను ఆత్మహత్య చేసుకోడమేగాక, తన ముగ్గురు పిల్లలను కూడా చంపేసిందట. కాఫీలో విషం కలిపి పిల్లలకు పట్టించి, తనూ త్రాగిందట. నాలుగేళ్ల కళావతి అనే పిల్ల వెంటనే మరణించి మిగతావారు ఆసుపత్రిలో మరణించారట.

## విరక్తి?

బెంగళూరు కాలేజీలో బియస్సి, రెండో ఏడు చదువుతున్న 17 ఏళ్ల కృష్ణదాస్ అనే అతను తన ఇంట్లో దూలానికి ఉరిపోసుకుని నిండుప్రాణాన్ని




తీసుకున్నాడట. ఈతని తండ్రి వెంకటగిరి గవుడ అదే కాలేజీలో ఉద్యోగం చేస్తున్నారట. కృష్ణదాస్ మరణానికి జీవితంమీద విరక్తే కారణం అని తెలినా ఆ విరక్తికి కారణం తెలియలేదు.

## సత్రంలో స్త్రీశవం

తిరుపతి భక్తులు నివసించే సత్రవులో ఒక రూములో 30 ఏళ్ల ఒక యువతి శవం కనుగొనబడిందట. రూములోంచి వాసన రావడంవల్ల పోలీసులకు చెప్తే వాళ్ళొచ్చి తాళం పగలగొట్టి చూశారట. భయంకరంగా ఉన్న యీ శవం నగ్నంగా వుందని, ఆమె శరీరంమీద ఎర్రచీర, ఒక రవికా కుప్పగా పడున్నాయనీ తేలింది. సత్రం రికార్డును పట్టి చూస్తే మార్చి 12 వ తేదీన ఆమెతో మరో ముగ్గురు మగవారు వచ్చి ఆ రూము తీసుకున్నట్టు తేలింది.

# తెలుగు తెరకి కొత్త నాయిక



'ప్రేమ ఉత్తరాలు రాయవద్దు — పెళ్ళి చూపులకి రావద్దు...'

బాలతారల్లో మకుటంలేని మహారాణిగా వెలుగొందిన బేబి పద్మిని నేడు కుమారి అయింది. ఇప్పుడామె బేబిపద్మిని కాదు; కుమారి పద్మిని. ఆమె భవిష్యత్తు ఎలాగుంటుంది? ప్రస్తుతం యేమి చేస్తుంది? ఆమె ఆశలు, ఆశయాలు ఏమిటి? అవి తెలుసుకుందామని యీ క్రింది ప్రశ్నలను వెయ్యడం జరిగింది.

ప్రశ్న : మీరు ఎప్పుడు సినిమాల్లో నటించడానికి ప్రారంభించారు?

జ : నా మూడో యేట.

ప్రశ్న : మీ మొదటి పాత్రయేది?

జ : 'పాశమలర్'లో చిన్న సావిత్రిగా నటించాను.

ప్రశ్న : మీకు 'నటి' కావాలనే కోరిక ఎలా కల్గింది?

జ : చేపపిల్లకు ఈత ఎవరు నేర్పిస్తారు చెప్పండి. మా అమ్మ రాధాబాయ్ గారు ఒక నటియే గదా. నేను మా యింట్లో అద్దంముందు నిలబడి మేకప్ వేసుకునేదాన్ని. 'స్టార్టు' 'ఓ. కే.' అనేదాన్ని.

ప్ర : మీకు మంచిపేరు తెచ్చిపెట్టిన పాత్ర ఏది?

జ : ఎ. వి. ఎం. వారి 'లేత మనసులు'; ఈ చిత్రానికి ఒక ప్రత్యేకత వుంది. ఈ చిత్రానికి అవార్డు వచ్చింది. ఢిల్లీకి వెళ్ళినప్పుడు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ నాకు ముద్దు పెట్టింది.

ప్ర : ప్రస్తుతం మీరేం చేస్తున్నారు?

జ : డ్యాన్సు నేర్చుకుంటున్నా. స్విమ్మింగ్ పూల్‌కు వెళ్తున్నాను. రైడింగు ప్రాక్టీసు చేస్తున్నాను. ఇంట్లో మా అమ్మగారికి వంటచెయ్యడంలో సహాయపడుతున్నాను. ప్రతిదినం అందంగా ఉండే పడుతున్నాను.

ప్ర : మీ వయస్సెంత?

జ : 14 సంవత్సరాలు.

ప్ర : మీ [illegible]

జ : ఈ సంవత్సరం మెట్రిక్ పరీక్షకు వెళ్తాను.

ప్ర : తెలుగులో మీ అభిమాన తారలెవరో చెప్పగలరా?

జ : శ్రీయుతులు రామారావు, నాగేశ్వరరావు, జగ్గయ్యగార్లు, శ్రీమతులు సావిత్రి, జానకి, జమున గార్లు.

ప్ర : మీ భవిష్యత్కార్యక్రమం ఏమిటి?

జ : శ్రీ నాగేశ్వరరావు, రామారావు గార్లతో కథానాయికగా నటించడమే.

ప్ర : మీ ఆశ, ఆశయం ఏమిటి?

జ : జయలలితలాగా రాకెట్ వేగంతో పైకి రావాలి; సావిత్రిలాగా మహానటి కావాలి; నాగేశ్వరరావు, రామారావు గార్లవలె ప్రజాదరణ పొందడమే గాక, వారు పాటిస్తున్న ఉత్తమ సంప్రదాయాలు నాకు అబ్బాలని కోరుతున్నాను. 'షావుకారు' జానకివలె జీవించాలి. జమున నాకు తోబుట్టువుతో సమానం.

ప్ర : జానకిగారిలాగా జీవించాలన్నారు? అలాగనడంలో మీవుద్దేశ్యం?

జ : ఆమె యింటిని ఎంత శుభ్రంగా పెట్టుకుంటుందో తెలుసా? ఆమె తన పిల్లలను ఎంత చక్కగా పెంచుకుందంటారు? ఆమె మిత్రులతో ఎంత నిండుగా, నిష్కల్మషంగా మాట్లాడుతుందో తెలుసా? ఆమె తన శరీరాన్ని, అందాన్ని ఎలా కాపాడుకుంటుందో తెలుసా? అందుకే ఆమెలాగా జీవించాలనుకుంటున్నాను.

ప్ర : ప్రస్తుతం మీరు ఎన్నిచిత్రాల్లో నటిస్తున్నారు?

జ : మాతా పిక్చర్స్‌వారి తెలుగు చిత్రం ఒక్కటే; తమిళంలో ఒక స్టేజి నాటకంలో ప్రముఖ పాత్ర ధరిస్తున్నాను.

ప్ర : మీ మాతృభాష ఏమిటి?

జ : తమిళం.

ప్ర : మీ అభిమానులకు మీరు చెప్పవలసిందేమయినా వుందా?

జ : చాలావుంది. 'నాకు ప్రేమ ఉత్తరాలు వ్రాయొద్దు; పెండ్లి చూపులకు రావద్దు; వారి అభిమానం, ఆదరణ మాత్రం వుంటే అదేనాకు పదివేలు' అని చెప్పండి.

— ఇంటర్వ్యూ: శ్రీనివాస్

జి. పి, హనుమకొండ

దరిద్రులకే పిల్లలెక్కువ అంటారు. అది ఎంతవరకు నిజం?

ధృతరాష్ట్ర సంతతి దుర్యోధనాదులకేం దరిద్రం?!

జి. ఎస్. ఆర్, వడ్డమాను

అన్ని దానములలో కెల్ల గొప్ప దాన మేది?

మీకు తెలియదా ఏం? విద్యా దానం?!

జె. జె. ఆర్, కాకినాడ

మీ కీర్తి సర్వత్రా వ్యాపించి నట్టేనా?

నాలాంటి సామాన్యుల కీర్తి మంచివారి మనసులోనే ఉంటుంది గాని మంది పెదవుల మీద కాదు రావుగారూ!

కె ఎస్. ఆర్, పాతపట్నం

ఇంత తమాషాగా జవాబు లిచ్చే శక్తి మీకెవరిచ్చారు?

ఇదేం పిచ్చిమాట రోజీ! నాశక్తి నా కెవరిస్తారు?! నేనే అనుభవంతో గడించాను.

ఎస్. ఎస్. డి, మొగలవల్లి

డబ్బుతో విలువకట్టే స్నేహితులని ఏమని పిలువాలి?

డబ్బువిలువ తెలిసిన వాళ్లని.!

ఎ. కె. బిజినేపల్లి

కొత్త రచయితలకు కూడా పారితోషిక మేమైనా యిస్తారా?

ఇస్తారు— ఇచ్చే అలవాటున్న పత్రికలవారు. అలాగే అడిగిన వారికే యిచ్చేవారూ, అడిగినా యివ్వని వాళ్లు కూడా ఉంటూ ఉంటారు.

కె. ఎస్. ఆర్, బొక్కం

మీ రచనల గురించి మీవారితో ఎప్పుడైనా చర్చిస్తూ ఉంటారా?

ఎందుకూ?!

ఎస్. ఎస్. ఎల్, శ్రీకాకుళం

గోరింటో మరువం వేస్తే పొడుగ్గా ఎదిగేస్తే బాగులేదు. పొట్టిగా గుబురుగా పెరగాలంటే ఏం చేయాలి.

ఏమొక్కైనా సరే, నిలువుగా ఎదక్కుండా పక్కలకి కొమ్మలు వేయాలంటే చిగుళ్లు కత్తిరించేస్తూ ఉండాలి. అప్పుడే కొమ్మకి పక్క చిగుళ్లు వస్తాయి.

పి. ఎస్. ఆర్, రాజమండ్రి

అక్కయ్య ప్రేమంటే ఏమిటి?

ప్రేమంటే ఒకరి కళ్లల్లోకి ఒకళ్లు చూసుకోవడం కాదు తమ్ముడూ, ఇద్దరు కలిసి ఒకే పక్క చూడ కలడం.




ఐ. ఆర్. ఎన్, వడ్లూరు

తమిళం సులభంగా నేర్చుకోవాలని ఉంది.

ముప్ఫయిరోజులలో తమిళము వచ్చేలా పుస్తకం వెలువడింది. ఏ పెద్ద పుస్తకాల షాపుకైనా వ్రాయండి.

వై. ఎ. ఆర్, విశాఖపట్నం

మీరు కె. హెచ్. కె. పర్వీపట్నంగారికి ఇచ్చిన జవాబు చదివాక ఆధునిక భావాలు కల మీకు పూర్వకవుల గ్రాంధిక భావాలే నచ్చడం నేటి విప్లవ కవుల అరుపులు... చూసేమోనని నా అనుమానం.

ఏం? వాళ్లొక్కరేనా అరుస్తున్నది! ఎవరైనా సరే మీరు ఒప్పుకోకుండానే అవి అరుపులేగాని కవిత్వం కాదని అంటున్నారు! గమనించండి.

పి ఆర్. ఎల్, హైదరాబాదు

నేను కనుక ఎవరైనా మగవాళ్లతో మాట్లాడితే అన్నయ్య మనస్సు గిలగిలలాడిపోతుంది. తనెంతమంది ఆడపిల్లలతోనైనా చనువుగా మాట్లాడుతాడు. ఏమేనా అంటే నీ కంత సెల్ఫిష్ పనికి రాదంటాడు...

అలాగా? మీరేమో యీ 'సెల్ఫిష్' నాకమ్మ జూస్తున్నారా!! పిచ్చితల్లీ అన్నయ్యలాంటి వాళ్లంతే! తాము బోయ్‌ఫ్రెండ్ అని చెప్పుకో లేరు. ఇంకోళ్లనా స్థలం ఆక్రమించుకోనీయరు.

ఎస్ ఆర్. ఆర్, కుందపల్లి

స్త్రీకి ముఖ్యముగా కావలసినది శీలమా? పాతివ్రత్యమా?

ఏమిటి? శీలంవేరూ? పాతివ్రత్యం వేరూనా!

జి కె ఆర్, పిఠాపురం

కంటికి అందం ఏమిటి?

కన్నీరెరుగని కంటికి సౌందర్యం లేదుతమ్ముడూ

జి జి. ఆర్, బన్నుచేరియా (ప బెం.)

అక్కయ్య ప్రేమ చేయడం చెడ్డదా?

చేయడం చెడ్డదే. పండడం మంచిది!

కె కె. డి, రాజమండ్రి

బ్రహ్మచారికి నిర్వచనం ఏమిటి అక్కయ్యా?

బ్రహ్మచారి వింత జంతువు. కత్తెరతో నగంలాగా వింతగా ఉంటాడు చిట్టి చెల్లెలా?!

ఎస్ ఎస్. కె.పి ఆర్, చిట్వేలి

హైందవునికి ఆత్మావలోకనమె లక్ష్యమా?

ఒక్క హైందవుని కేమిటి? మానవునకే ఆత్మావలోకనం అవసరం తమ్ముడూ.

ఎన్. ఐ. ఆర్, తాడేపల్లిగూడెం

నరకానికి నిర్వచనం ఏమిటి?

మీరడిగేది ఏనరకం గురించి? భూమిమీది నరకం గురించా? యములవారి దర్బారు గురించా. యముల వారి నరకం యింకా చూళ్లేదు. భూమిమ్మీదనరకం... పొందికలేని కొంపల్లో దర్శన మిస్తూనే ఉంటుంది.

ఎస్. బి. డి. ఎమ్, సత్తుపల్లి

అక్కయ్య బావ ఏ ఉద్యోగం చేస్తున్నారు?

ఏం లేదు తమ్ముడూ.

కె. ఆర్. ఆర్, నరసరావుపేట

భగవంతుని ధ్యానంలో పది నిముషాలు గడుపుదామంటే మనస్సు నిశ్చలంగా ఉండడంలేదు...

జ్యోతిలక్ష్మి క్యాలెండరు ముందుకూర్చుని ధ్యానిస్తే కుదరదు చిట్టి తండ్రీ! ఏ కృష్ణుడో ఏసో బొమ్మముందు కూర్చో.

ఎస్ బి ఆర్, కొన్నబహాలు

మీరు 68లో చెలపహార్ (ఒరిస్సా) వచ్చి యుంటిరి. అప్పుడు మీ ఫీలింగ్సు ఏమిటి?

నేను సంతోషంగా కాలం గడపడానికి రాలేదు. చాలా బాధతో ఆ ప్రాంతానికి వచ్చాను. నన్నొక స్నేహితుడిగాఎంచి అరమరికలు లేక అన్నీచర్చించి నన్నొక వ్యక్తిని చేసిన మానాన్నన కోల్పోయిన సందర్భంలో ఆ వూరు వచ్చానంతే.

ఎస్. వి. ఆర్. ఆర్, కొల్లావూరు

తమలో గొప్పతనం లేకున్నా గొప్ప వాళ్లను దూషించేవారి నేమనాలి?

అందని ద్రాక్షలు పులుపని నిస్పృహ చెందిన నక్కలు సార్ వాళ్లు. వాళ్లనేదో అనడంఎందుకు?

పి బి. ఎమ్, హుజూరునగరు

ప్రతి పురుషుడూ స్త్రీకి లొంగి ఉంటా డెందుచేత?

అది పురుషులైన మీకు తెలియదా ఏమిటి?

# మేఘమాల

పి.ఎస్.నారాయణ

### జరిగిన కథ

త్యాగరాజుకు పాటలు రావు. వినడంలోనూ అంత ఆసక్తి లేదు. నారాయణ అతన్ని ఒక కచేరీకి తీసుకు వెళ్ళాడు. నారాయణ సంగీతాన్ని ఆస్వాదిస్తుంటే త్యాగరాజుకి విసుగ్గా వుంది. చలపతితో కలిసి బయటికి వెళ్ళిపోయాడు. రాణీ సుందర మూర్తితో లేచి పోయిందని చలపతి చెప్పినప్పుడు త్యాగరాజు నిర్ఘాంతపోయాడు. అతను హైదరాబాదు వెళ్ళాడు. తనపై శకుంతలకున్న అభిప్రాయం తెలిసిపోయాక ఇక ఆమె యింట్లో వుండడం అతనికి మనస్కరించలేదు. ఉద్యోగాన్వేషణతో పూరిమీద వచ్చాడు. అతనికి రాజేశ్వరి కనిపించింది. ఇద్దరూ కలిసి అద్దెకి ఒకే యిల్లు తీసుకున్నారు. హాస్పిటల్‌లో వున్న స్నేహితుడు చంద్రం గురించే అతనికి ఎక్కువ ఆలోచన పట్టుకున్నది. రోజూ హాస్పిటలుకు వెళ్ళి చూసి వస్తున్నాడు. కాని, చంద్రం చచ్చిపోయాడు. ఆ దిగులుతో క్రుంగిపోయాడు త్యాగరాజు. సత్యవతి అంతకంటేను. త్యాగరాజు రాజేశ్వరిని పెళ్ళిచేసుకుంటాడు.

---

## 12

రాజేశ్వరి, త్యాగరాజు ఓ పెద్ద షాపులోకి వెళ్ళారు.

ఇద్దరూ బాలీసులమీద కూర్చున్నారు.

'కంచీవరం పట్టుచీర లేవైనా చూపించండి !' అడిగింది రాజేశ్వరి.

'పెద్ద అంచా ?'

'మీడియమ్ సైజ్ !'

కుప్పలు కుప్పలుగా చీరెలు ముందుకు వచ్చి పడ్డాయి.

అందులో ఓ చీరె — నీలి ఆకాశపు రంగులో — అక్కడక్కడా జరీ పువ్వులతో ఎంతో అందంగా కనబడింది ?

త్యాగరాజే దాన్ని కుప్పలోనుండి బయటకు లాగాడు.

'ఇది చాలా బాగున్నది !'

రాజేశ్వరి నవ్వి, 'నాకు శ్రమ తగ్గించారన్నమాట !' అంటూనే చేతిలోకి తీసుకున్నది. దాన్ని పరిశీలనగా చూచి తృప్తిగా, 'దీనికి సరిపడే బ్లౌజ్ పీస్‌కూడా కావాలి !' అన్నది.

'మరి నీకు నచ్చిందా ?' అడిగాడు ఆశగా ముందుకు వంగి.

'ఆఁ...' నిండుగా అన్నది.

అదే రంగులో బ్లౌజ్‌పీస్ గూడా తీసుకున్నారు.

బట్టలు ప్యాక్‌చేసి బిల్లుయిచ్చారు. మొత్తం యాభైఆరు రూపాయలు !

ఇద్దరూ మళ్ళా రిక్షా ఎక్కారు.

'మీ సెలక్షన్ చాలా బాగున్నది !' అన్నది రాజేశ్వరి చిన్నగా నవ్వి.

క్షణం త్యాగరాజు సిగ్గుపడుతున్నట్లుగా ఆగి, 'నేను ఒకటి రెండు కేసులు చూచాను ... భర్తకునచ్చి తెచ్చినవి భార్యకు నచ్చకపోవటం...మన వివాహానంతరం కొన్న మొదటిదే ఇద్దరికీ నచ్చటం మనముందు జీవితానికి ఓ శుభ సూచకంగా వున్నది!' అన్నాడు తృప్తిగా.

రాజేశ్వరి నవ్వి వూరుకున్నది.

త్యాగరాజు కొద్దిగా పశ్చాత్తాప కంఠంతో, 'నేను చాలా తెలివితక్కువ పనిచేశాను ... ఈ బహుమానాన్ని నీచేత అడిగించుకోకుండా నా అంతట నేనే కొంటే ఎంతో బాగుండేది !' అన్నాడు.

రాజేశ్వరి త్వర త్వరగా, 'ఇది నాకు కాదు !' అన్నది.

'మరి ?' మదురు ముడివేశాడు.

'ఎవరికోసం అనుకున్నారు ?'

'ఇప్పుడే చెప్పాలా ?' అన్నది ఓర చూపుతో.

'నీ యిష్టం ... నీ యిష్టం !' అన్నాడు కొద్దిగా నీరసపు కంఠంతో.

రిక్షా యింటిముందు ఆగింది.

ముందు త్యాగరాజు దిగాడు.

దిగి ఇంటివైపుకు చూచిన మరుక్షణంలోనే అప్రతిభుడయ్యాడు.

ఇల్లు తాళం వేసివున్నది.

'సత్యవతి ఎక్కడకు వెళ్ళింది ?' కలవరపడుతూ అన్నాడు.

అప్పటికే రిక్షా దిగిన రాజేశ్వరి అదే పరిస్థితిలో వుండిపోయింది.

అతడిమేనుని భయం నల్లనిమేఘంలా ఆవరించింది.

'ఆమె ఏ అఘాయిత్యమూ చేయలేదు కదా ?'

కంఠం వణికింది.

రాజేశ్వరి నోట మాటలేక, పాలిపోయిన మొఖంతో తమయింటికి వేసివున్న తాళంవంక చూస్తున్నది.

'డబ్బులివ్వండి బాబూ ! వెళ్ళిపోతాను !' రిక్షావాడి మాటలకు ఉలిక్కిపడి, జేబులోవున్న చిల్లరడబ్బులు తీసి అతడి చేతిలో పడవేశాడు.

'ఒంటరిగా—ఒకసారి తమ ఎదుటనే ప్రాణానికి తలపడ్డ ఆమెను — వదిలి వెళ్ళటం ఎంతో పొరబాటయింది !' అనుకున్నారు యిద్దరూ.

గుండెలు దడ దడ లాడుతున్నాయి.

తమ జీవితంలో ఒక శుభదినాన ఏలాంటి దుర్ఘటన జరిగింది.

సరిగ్గా అటువంటి సమయంలోనే ఆ యింటి యజమానురాలు తలుపుతీసుకు బయటకువచ్చి, 'అరె వచ్చారా మీరు!... సత్యవతి తాళంచెవి యిచ్చింది!' అంటూ తాళం తీసుకురావటానికి లోపలికి వెళ్లబోయింది,

'ఆమె ఎక్కడకు వెళ్ళింది?' ఇద్దరూ ఒకేసారి అడిగారు...కంపిస్తున్న కంఠాలతో ఆత్రంగా ముందుకు అడుగులు వేస్తూ.

'తెలియదు!'

ఆమె తాళంచెవితెచ్చి ఇచ్చింది.

ఇంట్లోకి వెళ్ళాలంటే ఇద్దరికీ భయంగానే వున్నది.

రాజేశ్వరి తాళంతీసి తలుపులు లోపలకు నెట్టింది.

తల వంచుకొని త్యాగరాజు మెట్లెక్కాడు.

—ముందుగా తలుపుతీసిన రాజేశ్వరి దృష్టి ఇంటిమధ్యలో చాపమీద పెట్టి వున్న కాగితంమీదా, అది ఎగిరిపోకుండా బరువుగా వుంచిన గాజు గ్లాసుమీద పడింది.

ఆత్రంగా దాన్ని తీసుకోబోతున్న రాజేశ్వరి చేతిని తోసేస్తూ, ఆ కాగితాన్ని లాక్కుంటున్నట్లుగా తీసుకొని వడివడిగా చదవసాగాడు త్యాగరాజు.

'త్యాగరాజు గారికి,

ముందుగా క్షమాపణలు కోరుకోవటం నా విధి. మీరు నన్ను మన్నించాలి.—

ఈనాడు నేను చేస్తున్నది తప్పో, ఒప్పో నాకయితే తెలియదుగాని అలా చేయటంలో నా తెలివినంతా ఉపయోగించాననే అనుకుంటున్నాను — అందువలన లోకందృష్టిలో తేలిక్కైపోననేదే నా భావన!

వెన్నెల నీడలో, నాభావి జీవితాన్నంతా ఏలాంటి ఒడుదుడుకులూ లేకుండా గడపవచ్చనే ధైర్యం నాకున్నా—దానిని కాదని, కాలదన్ని ఈ నిర్ణయానికి వచ్చి — ఆ వెన్నెల నీడకు దూరమయి — రాళ్ళూ రప్పలతో గూడిన బాటలో కాలు పెడుతున్నాను— దాని కష్టనష్టాలకు సంపూర్ణంగా బాధ్యురాలను నేనే!

ఈనాటి లోకం తీరు ఇది—చూడంది చూచినట్లుగా కల్పించటం—వ్యక్తులను, అందునా దయామూర్తులు, ధర్మమూర్తులు, దేవుళ్ళలాంటి మనుష్యుల



పేద ఆభోరడాలు వేయటం—అంతేగాదు, జీవచ్ఛవంలా బ్రతుకుతున్న వ్యక్తులను వాళ్ల ఊహాబంధాలలో బంధించి, మెలి తిప్పి రచ్చకీడ్వటం...

ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే—

దేవుడిలాంటి మీదగ్గర నా శేష జీవితాల్ని గడపటంకంటే నాకు కావాల్సినదేం వున్నది?—నేను కోరుకునేదేవున్నది కాని, ఎన్నాళ్ళుండేది అలా...నన్ను ఎన్నాళ్ళు భరించగలుగుతారు మీరు ?—లోకుల దృష్టిలోమనం ఎన్నాళ్ళు శాంతిగా వుండగలుగుతాం?

నావలన మీలాంటి వ్యక్తుల గుండెల్లో సుడిగుండాలు ఏర్పడటం నేను సహించలేనన్నయ్యా!

—మీలాంటి అన్నయ్య నాకున్నందుకు నేనెంతగానో సంతోషిస్తున్నాను—గర్విస్తున్నాను గూడా !

నేటి మన సమాజం ఒక కోనేరు లాంటిది.

అందులోని నీరు పచ్చబారినా, పాచి పట్టినా ఆ నీటిని తోడేసి కొత్తనీటితో నింపటం అసాధ్యం మాత్రం కాకపోయినా, తేలికమాత్రం కాదు. అలాగే మన సమాజంలో పాతుకుపోయిన కొన్ని భావాలు మారాలన్నా అంత తేలిక కావేమోననిపిస్తోంది—వో మానసిక విప్లవంలాంటిది వస్తేగాని...

ఉదాహరణకు మీరే వున్నారు—

వాసనవచ్చే నీటికి దాపులో కోనేటి

# మేఘమాల

నడుమ చిన్న దేవాలయం వుంటుంది... దేవుడుంటాడు ... ఆ దేవుని మొఖం చూస్తూ కూర్చుంటే మనకు ఎంతో ప్రశాంతి లభిస్తుంది.

ఈ సమాజంలో అలాంటి దేవుళ్లలో ఒకరు మీరు...ఇది అతిశయోక్తిగాదు !

—కాని, దేవుళ్లు తప్పుచేస్తారని, తప్పుదోవలు తొక్కుతారని పురాణగాథలు చెబుతాయి...అందుకు నిదర్శనం మీరు గూడా !

రాణి వెళ్లిపోయింది.

ఆమె భావిజీవితానికి వెలుగూ, వసంతమూ చేకూర్చుకునేందుకుగాను పునాదులు వేసుకుంటూ ... వేసుకున్నది గూడా...

ఆమె ఊహించుకున్న హర్మ్యలన్నీ సువర్ణమండపాలే అయినయి — ఆమె సుఖిస్తోంది ... జీవితాంతం సుఖిస్తుంది గూడా...

కాని, మీరు ఆమెను ఏవగించుకుంటున్నారు...కసిరి కొడుతున్నారు ... దూర దూరాలకు నెట్టివేస్తున్నారు.

ఎందుకని ?...

ఆమె ముందు జీవితపు బాటలో ముళ్ళు, రాళ్ళు లేకుండా చేసుకో ప్రయత్నించటం ఆమె చేసిన నేరము ?...

నిజం చెప్పాలంటే ఆ విషయంలో నేను మిమ్మల్ని మెచ్చలేకుండా వున్నానన్నయ్యా !

వదినెగారికి నా నమస్కారములు.

త్వరలోనే మీ వివాహం జరుగుతుందని ఆశిస్తాను...జరగాలని గూడా కోరుకుంటున్నాను. (ఒక్కమాట : కోపగించుకోకండి —మీరు రాణి ఏదో తీసిందని ఏవగించుకున్నారు — రాజేశ్వరికే వో అన్నగారు వుంటే ఆమె చర్యను ఆయన ఏవిధంగా భావించి వుండేవారు—నన్ను క్షమించగలరనే నా ధైర్యం !)

నేను వర్కింగ్ గరల్స్ 'హాస్టల్లో జేరాను—రాణిద్వారా... ఆమె బావగారు జయరాంగారి సహాయంతో—కాగితాలమీద వారి కంపెనీలో పనిచేస్తున్నట్లుగా సృష్టించుకొని — త్వరలోనే నిజంగానే ఉద్యోగస్థురాలని అవ్వగలననే ఆశతో !

మీరేమీ భయపడవద్దు. నేను మీకు హామీ యిస్తున్నాను...జీవితంలో మరెన్నడూ పదిరోజులక్రితం ఆనాటి అర్ధరాత్రి సిగ్గువిడిచి చేసిన అఘాయిత్యాన్ని చేయను !

—నేను జీవిస్తాను ... తిరిగి మీరు నాకు జీవితాన్ని ప్రసాదించినందుకైనా, అవసరమొస్తే జీవితంతో పోరాడి విజయ సాధనకు ప్రయత్నిస్తాను...

—నాకు మా అన్నగారి సహాయ సహకారాలు ప్రతిక్షణం ఎంతో అవసరం !

అందుకే మీ ఆశీర్వాచాలు ఆశిస్తూ,

మీ చెల్లెలు

సత్యవతి.

* *

మధ్యాహ్నం మూడుగంట లయింది.

రాజేశ్వరి కాఫీ కాచి తీసుకువచ్చి, అతడికి ఎదురుగా పెట్టింది.

ఆరోజు మధ్యాహ్నం సత్యవతి ఇంట్లో వుంచి వెళ్లిన ఉత్తరం చదువుకున్న తరువాత మనస్సులోని వేదన కొద్దిగా తగ్గినా—యిద్దరికీ అన్నం సహించలేదు.

అసలు వారి జీవితంలోని ఆ శుభదినాన అన్నమే తినేవారుగ దేమో!

కాని ఆహ్వానితుడైన స్వామి రాగా అడడితోపాటు కూర్చొని చాలా మౌనంగా భోజనంచేశారు.

స్వామి వారి మౌనాన్ని గుర్తించినా దానివెనుక విషయాన్ని అడిగే ధైర్యమూ, చనువూ లేక మెదలకుండా ఊరకుండిపోయాడు.



# రాబిన్ బ్లూ ప్రత్యేక హామీ



## అతి చౌకగా మీ వస్త్రాలకు స్వచ్ఛమైన తెల్లదనం

రాబిన్ బ్లూ—ప్రత్యేకంగా తెలుపు చేయగలనట్టిది. ఇతర నీలిమందులు ఇవ్వలేనట్టి తెల్లదనాన్ని ఇది ఇవ్వగలదు. చిటికెడు రాబిన్ బ్లూతో అనేక బట్టలను తెల్లగా ఉతుక్కోవచ్చు. పైగా ఇది సురక్షితమైనది—సర్వదా మీ వస్త్రాలను ధవళతరంగా వుంచగలదు.




## ప్రకృతి సహజమైన తెల్లదనానికి రాబిన్ బ్లూ

# మేఘమాల

—ఎంతో సరదాగా గడిచిపోతుందనుకున్న రోజు చాలా నీరసంగాను, నిర్జీవంగానూ తయారయింది.

'నేను చాలా భయపడ్డాను. ఏం అఘాయిత్యం చేసిందోనని!' అన్నాడు త్యాగరాజు—ఆ ఉత్తరం చదివిన తరువాత ఆ విషయంమీద మొట్ట మొదటిసారిగా మాట్లాడుతున్నట్లుగా.

'నేనూ ఆలాగే అనుకున్నాను... మనకు కష్టం కలిగించేదే అయినా...ఆమె జీవితగమనానికి మంచి ప్రాతిపదికనే వేసుకున్నదని అనుకుంటాను!' ఓ నిట్టూర్పు విడిచింది రాజేశ్వరి.

'ఆ ఏర్పాటుకు ఆమె ఇక్కడినుండి వెళ్లి పోవాల్సిన అవసరమేముంది... ఇక్కడే వుండి స్టైపు నేర్చుకోవచ్చునే, కాదంటే చదువుకోవచ్చునగూ. .ఉద్యోగం ఒకటి ఆమెకు మనం చూడలేకపోయే వాళ్లమా?'

అతడు ఆ మాటలను ఎంతో అభిమానంగా అన్నా అతడి కంఠంలోని జీరకు అర్థం ఆమెకు తెలుసు!

'రాణిద్వారా ఈ పని జరగటం ఆయనకు కష్టంగా వున్నది!—'అనుకున్నది. చిన్నగా నవ్వుకున్నది లోలోనే.

'మన ప్రమేయంలేకుండానే మన మనస్సుకు బాధ కలిగే సంఘటన ఒకటి అనుకోకుండా ఈనాడు జరిగింది—అంతేగాదు, ఎంతో ఉల్లాసంగా గడపవలసిన ఈ సమయంలో మీ మనస్సుకు కష్టం కలిగించే మరోపని గూడా నేను చేస్తున్నాను!' తలవంచుకు అన్నది రాజేశ్వరి.

'ఏమిటది?' అన్నాడు నిర్లిప్తంగా.

'మీరు కోపం తెచ్చుకోగూడదు... నా వివాహసమయాన నా ముద్దుకోరికగా భావించి, తీర్చండి!' అన్నది దీనంగా చూస్తున్నట్లుగా అతడి మొఖంలోకి చూస్తూ.

'చెప్పు రాజూ!' అన్నాడు ప్రేమగా ఆమె కళ్లల్లోకి చూస్తూ, పేలవంగా నవ్వి.

ఆమె చెప్పటానికి సంశయిస్తున్నట్లుగా ఒక్కక్షణం తటపటాయించి, 'రాణి ఒంటి మనిషిగదు... అందుకే ఈ ఇంటి ఆడబడుచుగా ఆమెకు మన వివాహసందర్భంలో కొత్తచీరెను పసుపు కుంకుమలతో ఇచ్చివద్దామనుకుంటున్నాను!' అన్నది.

అలా అంటూనే భయంభయంగా అతడి మొఖంలోకి చూచింది.

'నీయిష్టం!' ఏలాంటి భావనా వ్యక్తీకరించకుండా చాలా మామూలుగా అని, ఆ మధ్యాహ్నం మూడుగంటల సమయంలో నిలువెల్లా దుప్పటి కప్పుకొని పడుకున్నాడు.

ఆ విషయంలో మరి రెట్టించలేదు రాజేశ్వరి.

లేచి నిలబడి తాను చేయదలచుకున్న కార్యక్రమానికి ఆయత్తమవ్వసాగింది.

* * *

సాయంత్రం ఆరుగంటలసమయంలో, త్యాగరాజు వంటరిగా, బరువైనగుండెతో తెరిచివున్న తలుపుగుండా రోడ్డుమీద వచ్చేపోయేజనాన్ని చూస్తూ కూర్చున్నాడు చాపమీద.

రాజేశ్వరి రాణిగృహంనుండి వస్తూనే త్యాగరాజును చూచి నవ్వింది.

త్యాగరాజు మొఖం తిప్పుకున్నాడు.

వచ్చి చాపమీద అతడికి ఎదురుగా కూర్చున్నది.

'ఈరోజున అన్నీ మీ మనస్సుకు కష్టం కలిగించే పనులే జరుగుతున్నాయి... వాటిలో కొన్నిటికి నేనే బాధ్యురాలి నేమో గూడా!' అన్నది చిన్నగా తలవంచుకొని.

'ఆలా ఎందుకనుకోవాలి?' అడిగాడు చిన్నగా నవ్వి 'కష్టాల్లో పుట్టినవాడు సుఖాల్లో జీవిస్తాడేవో!'

రాజేశ్వరి భావగర్భితంగా నవ్వి 'మీ రెలాగైనా అనుకోండి...నా ఈమాటలు మీకు యిష్టంలేని నాలోని మరో కోరికకు ప్రాతిపాదికలు!' అన్నది.

'ఏమిటా కోరిక?' గంభీరంగా అడిగాడు.

'తీర్చేటందుకు రెడీనా?'

'కోరికలు తీర్చటంమీద నా భావనలేవో నీకు ఉదయానే చెప్పాను!'

'అవి కొన్నిటికే చెల్లవచ్చు...'ఒక్క క్షణం కళ్లు మూసుకొని తన ఊహల్లో తననీయురాలౌతున్నట్లుగా ఆగి, మిమ్మల్ని ఈ ఉదయాన నా భర్తగా

పొంది నా జీవితానికి ధన్యత్వం చేకూర్చుకున్నాను...మీచేత డబ్బుఖర్చు పెట్టించి కొన్నిరోజులుగా నాలో పేరుకుపోతున్న కోరికను కొద్ది గంటలక్రితమే తీర్చుకున్నాను...ఇప్పుడు నాకిష్టమైన ఓ ప్రోగ్రాంకు మీ కాలాన్ని మన ధనాన్ని గూడా వృధాచేస్తూ మిమ్మల్ని తీసుకువెళ్లి ఆనందపు అమృతంలో మునిగిపోయే ఆ కోరికనూ తీర్చుకోబోతున్నాను!' అన్నది.

ఆమెకళ్లు సగం మూసుకొని మసక మసకగా భర్త ముఖంలోకి చూస్తూ ఓ అందమైన ఆనందమైన మేఘమాలను సృష్టించుకో సాగింది...

త్యాగరాజు ఉత్సాహంగా ముందుకువంగి 'ఏం ప్రోగ్రామది...ఎక్కడ?' అడిగాడు.

'ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి పాటకచేరీ రవీంద్ర భారతిలో!' అన్నది కళ్లు తెరచి భర్త ముఖంలోని భావాలను ఆదుర్దాగా వెతుకుంటూ.

భార్యను తొలినాడే నిరుత్సాహ పరచటం యిష్టంలేదన్నట్లుగా 'వెళ్దాం పద!' అన్నాడు లేస్తూ.

రాజేశ్వరి అత్యుత్సాహంతో లేచి, పరుగెడుతున్నట్లుగా పనులన్నీ పూర్తి చేసుకొని పావుగంటలోనే 'రెడీ' అన్నది.

'ఈపూట వంటగూడా చేయటంలేదు!' అన్నది అప్పుడే అల్లుకున్న జడను విసురుగా వెనక్కు వేసుకుంటూ.

'మొదటిరోజే భర్తగారికి పస్తా?' అడిగాడు వింతగా కళ్లు పెద్దవి చేసుకొని.

'లేదు...హోటల్లో స్పెషల్ డిన్నర్!' తల ఎగరవేస్తూ ఏదో విజయం సాధించినట్లుగా అన్నది.

యిద్దరూ రిక్షాలో రవీంద్ర భారతికి వెళ్లేటప్పటికి సరిగ్గా ప్రోగ్రాం మొదలుపెట్టేందుకు ఇంకా పదినిముషాల టైం వున్నది.

హైదరాబాద్‌వచ్చి ఇన్ని రోజులయినా— బయటనుండి ఎన్నోసార్లు చూచినా — రవీంద్ర భారతి లోపలికి వెళ్లటం ఇదే ప్రథమం!

ఆ ఆవరణంతా చిన్నకార్లతో నిండిపోయివున్నది.

రవీంద్ర భారతి ఎత్తు మెట్లెక్కుతూ ఒక్కసారి ఆ పరిసరాలను వెనుదిరిగి

చూచాడు — వింతో ప్రఫుల్లంగా కన బడింది అక్కడనుండి ఆ పరిసర ప్రదేశం!

ముందుకు తిరిగితే ముందుగా నాలుగు మెట్లు పైకెక్కిన రాజేశ్వరి వెనుదిరిగి తనవంకే చూస్తూ కనబడింది.

లైటు గచ్చకాయరంగు పూల పుల్ వాయిల్ చీరలో అదేరంగు జాకెట్టుతో... పొడువైన వాలుజడలో ఒకేఒక గులాబీతో అందంగా పొడుగ్గా సన్నగా, మాధవీ లతలా వున్న ఆమె, బుగ్గలు సొట్టలు పడేలా నవ్వుతూ అతడి గుండెల్లో వెయ్యి దివ్వెలు వెలిగిస్తోంది...

'ఇన్నాళ్ళూ రాజేశ్వరిలోని ఈ అందం ఏమైంది?—' వడివడిగా, ఆమెను అందుకోవాలన్నట్లుగా ఆత్రంగా పైకి అడుగులు వేశాడు.

మెయిన్‌గేటు దాటి లోపలికి వెళు తుండగా, దగ్గరిగావచ్చి ఆమె బుజం మీద వంగుతూ, 'టిక్కెట్లు తీసుకో వద్దూ?' అన్నాడు.

'ఇందాకనే తెప్పించాను!'

'ఎప్పుడు—ఎక్కడ?' అని గూడా అడగకుండా ముందుకు ఆమెను అనుసరిం చాడు.

మొదటిద్వారంగుండా లోపలకు వెళ్ళి స్టేజికి దాపులోవున్న కుర్చీలవైపుకు నడవసాగారు.

అప్పటికే హాలు జనంతో నిండిపోయి కిటకిట లాడుతోంది.

ఖాళీకుర్చీలు ఎక్కడ వున్నాయా అని ఆత్రంగా వెతుక్కోసాగాడు త్యాగరాజు.

'ఆపైన వున్నాయి—వెళ్దాంపదండి!' అంటూ ముందుకు నడిపించింది త్యాగ రాజుని, కాంతివంతమైన కళ్ళతో.

చల్లగా, చలిపుట్టేలావున్న ఆ వాతా వరణంలో రెండువరుసల నడుమ, కాళ్ళు ముడుచుకుంటున్న మనుష్యులను తప్పు కుంటూ ఖాళీకుర్చీల దగ్గరకు నడిచాడు.

ఖాళీకుర్చీల దగ్గరకు రాగానే అటు ఎవరో స్త్రీ ఉన్నట్లుగా గమనించి రాజే శ్వరిని అటు కూర్చోమనబోతూనే ఉలిక్కి పడ్డాడు.

అక్కడ కూర్చున్నది రాణి!

—ఉదయం తాను ఎంతో బాగుందని కొన్న నీలి ఆకాశపురంగు చీరెలో ముడుచుకుపోయిన ఆమె తనవంకే జాలిగా చూస్తున్నది.

ఇబ్బంది పడుతున్నట్లుగా వెనుదిరిగి రాజేశ్వరికి ఏదో చెప్పబోయాడు.

రాజేశ్వరి సైగలతో కూర్చో మంటోంది.

ఇంతలోనే లైట్లు డిమ్ అయ్యాయి.

స్టేజీమీది తెరలు తొలుగుతున్నాయి.

మైక్‌లో ఎవరో ఏదో చెబుతున్నారు...

జనం గోల కేకలు... 'కూర్చోండి... కూర్చోండి...!'

త్యాగరాజు చటుక్కున కూర్చున్నాడు— అంత చల్లటి వాతావరణంలోనూ పడు తున్న చెమటలను అసహనంగా జేబు రుమాలతో తుడుచుకుంటూ...

కూర్చున్న తరువాత ఒక్కక్షణం తీక్ష ణంగా ఆలోచిస్తే ఇంత పెద్ద హాలులో రాణి పక్కనే రెండుసీట్లు ఖాళీగా వుండటం—అందునా తమకోసరమే అన్న ట్లుగా—అతణ్ణి చకితుణ్ణి చేసింది!

అనుమానంతో పక్కకు తిరిగి నిశి తంగా రాజేశ్వరి ముఖంలోకి చూస్తే ఆమె పెదాల చివర విరుస్తున్నట్లుగా వున్న నవ్వు ఆసంఘటనకు ఏదో భాష్యం చెప్పింది...

—అతడు కొద్దిగా కష్టంగా చిన్నగా మూలిగాడు.

పాటకచ్చేరీ ప్రారంభమయింది.




త్యాగరాజుకు పాటలు రావు!

—అంతేగాదు పాటలన్నా, పాటలుపాడే వాళ్ళన్నాగూడా అంత ఆసక్తిలేదు.

అందుకనే—ఆ గానకచేరీలో మునిగి పోయిన మనుష్యుల నడుమ కూర్చొని— అతడి ఆలోచనలలో అతడు లీనమై పోయాడు.

అతడి చుట్టూ మేఘాలు సృష్టించు కుంటున్నాడు. అందులో అందమైనవీ, తెల్లనివీ...హృదయం గగుర్పొడిచేలా నల్ల నివి... పెద్దవి...వికృతమైనవి...

మేఘాలు ఎవరు ఎలా ఊహించుకుంటె వాళ్ళకు అలాగే కనిపిస్తాయి...వాటిల్లో రాక్షసులను చూడవచ్చు ... కామధేనువు లను చూడవచ్చు... అరణ్యాలను చూడ వచ్చు... అందాలను చూడవచ్చు...విరిగి పోయినకోటలే కనబడితే ... తళతళలాడే తాజమహలే గుర్తుకు చేసుకోవచ్చు..

అలాగే...

తడబడ్డాడు త్యాగరాజు.

తనకు తారసపడిన వ్యక్తులూ, వాళ్ళ చేష్టలూ గూడా—తను ఏవేవో అర్థాలు కల్పించు కున్నప్పుడు — తనకు వాళ్ళు అలాగే కనబడ్డారు ... మంచివారుగా ఊహించుకున్న వారి విషయంలో వారు చేసిన పనులుగూడా ఎంతో మంచిగానే కనబడినయి.

అంతదాకా ఎందుకు —

తానే ఒక మేఘమనుకుంటే — జీవి తంలో పయనిస్తూ ఎంతోమందిని చూచాడు...అందులో మంచివారువున్నారు ...చెడ్డవారు వున్నారు... చూడదగ్గవారు వున్నారు...చూడదగనివారు వున్నారు ...

... మేఘంగా తన కర్తవ్యం ఆ వ్యక్తుల్ని, వాళ్ళచేష్టల్ని చూసీ చూడ కుండా పోవటమే.

వాళ్ళని ఎదుర్కోవటం వలనగాని, కించపరచటం వలనగాని తాను సాధించే దేమిటి?

తాదాప్యంచెంది ఆ ప్రశ్నను పదే పదే గొణుక్కో సాగాడు.

'న్యాయా న్యాయాలు నిర్ణయించే అధికారం తనకువున్నదా?...'

ఆ క్షణంలో సత్యవతి వ్రాసిన పాడ

పైన ఉత్తరం కళ్ళముందు గిరగిరా తిరిగింది.

విచలితు డయ్యాడు.

గింగిల లాడాడు.

— తను తప్పుదారిన పోతున్నాడా ?

సరిగ్గా ఆ సమయంలోనే —

తన చల్లని చేతిమీద మరో చల్లని చేయి పడినట్లనిపించింది—అతడికి.

ఉలిక్కి పడ్డట్టుగా చూచాడు.

ఆ చేయి వణుకుతున్నది.

ఆ చేతికివున్న బంగరుగాజులు వణుకుతున్నాయి ...

ఆ చేయి ఎవరిదో ఆ వ్యక్తి నరనరం వణుకుతున్నట్లే అనిపించింది... తనచేయి ఆ చేతిలో బిగుసుకుపోతుంది.

'అన్నయ్యా! అన్నయ్యా!'... చిన్నగా చాలా చిన్నగా ఓ కంపిత కంఠంనుంచి వెలువడినాయి ఆమాటలు.

అతడిమనస్సు విలవిల లాడింది— పగిలి ముక్కలయింది.

ఎన్నాళ్లయింది రాణి అలా పిలచి?

—ఓ మధురభావన ఎన్నడో మూసుకుపోయిన హృదయ కవాటాల్ని చీల్చగా, 'చెల్లీ!' పెదాలు కదిలినాయి.

అతడి కళ్ళవెంట నీరు గిరురున తిరిగింది.

'నీ వెన్నాళ్ళయింది నన్ను అలా పిలచి చెల్లీ?' అతడు ఆవేశపు ఉరవడిలో పథవిహీను డయ్యాడు.

'రాణి...రాణీ...రాణీ!' హృదయానికి హత్తుకుందామా అనిపిస్తోంది.

అదే సమయంలో—

రాణికి అటువైపుగా కూర్చున్న సుందరమూర్తి, జయరాం కళ్ళు కృతజ్ఞతా పూర్వకంగా రాజేశ్వరి వైపుకు చూస్తున్నాయి.

రాజేశ్వరి తేలిగ్గా ఏదో భారం తీరినట్లుగా నిట్టూర్పు విడిచింది—

—లేకపోతే, తమ వివాహ సందర్భంలో ఎంతవద్దన్నా వినకుండా ఓ పెద్దహోటల్లో సుందరమూర్తి ఏర్పాటు చేసిన విందుకు— రాణి, బలవంతాన త్యాగరాజును తీసుకొని రమ్మనమని నెత్తిన రుద్దిన భారం— తీర్చుకోలేక అబాసుపాలయి వుండేది తను!

(అయిపోయింది)

# కొత్త ముఖం తొడుక్కో

పాతముఖం చూసి చూసి
రోత పుట్టింది లోకానికి
ముఖం మొత్తింది అద్దానికి.
లాభం లేదు
తిప్పి తొడిగినా తోమి కడిగినా
గుప్పెడు గుప్పెడు పౌడరు పులిమినా
గోరంత లాభం లేదు.
పాతముఖాన్ని లాండ్రీలో పారేసి
కాకుంటే మ్యూజియంలో దాచేసి
కొత్త ముఖం తొడుక్కో.
శూన్యాన్ని చీల్చుకుని
సూర్యుణ్ని పోల్చుకుని
క్షణకాలం నిలవలేని
చచ్చు చూపులతో;
పలకరించే గుండెల్లో
తొలకరి జల్లులా కురిసి
పచ్చదనం పండించలేని
పుచ్చునవ్వులతో
ఊడిగిల్లిన ముఖాన్ని
ఎన్నాళ్లని మోస్తావు?
ఎదగలేని జీవితాన్ని
ఎన్నాళ్లని భరిస్తావు?
నువ్వు తొడుక్కునే కొత్త ముఖంలో
రవ్వల్లాంటి నిప్పురవ్వల్లాంటి
నవ్వులుంటాయి.
అవి
సత్యభామముక్కుపోగులో
నిత్యనూత్నంగా మెరుస్తాయి
నరకప్రవృత్తిపై తిరగబడి
చరచరా దహించివేస్తాయి.
నువ్వు తొడుక్కునే కొత్త ముఖంలో
కిరణాల్లాంటి కొరడాల్లాంటి
చూపులుంటాయి.
అవి
దురహంకారాల పీకల్ను
తరిమికొడతాయి.
చియ్యపట్టిన మాత్సర్యాలను
చిల్లగొడతాయి.
ఆముఖం వెనకుండే ఆలోచనలు
కలితీ ఎరుగని
కలతల్లేని
సెలయేళ్ళలా దూకుతాయి.
శక్తిని విద్యుచ్ఛక్తిని
సంధిస్తాయి.
చైతన్యానికీ సౌజన్యాన్ని
సంఘటిస్తాయి
అందుకే ప్రతిపాదిస్తున్నాను
పాతముఖాన్ని బహిష్కరించి
కొత్త ముఖాన్ని ఆవిష్కరించాలని.
బిగి దప్పిన మొరడు బ్రతుకుల్లో
ఉగాది చిగురించాలని

—డా. నారాయణరెడ్డి

## వారఫలం

### 10-4-1970 శుక్రవారం మొదలు
### 16-4-1970 గురువారం వరకు

**మేషం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు —సంతోషకరమైన వార్తలను వింటారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృషభం:** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు

**మిథునం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. అధికవ్యయం జరుగుతుంది. వారంమధ్యలో వృత్తి వ్యాపారాల్లో అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**సింహం:** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారంమధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు.

స్త్రీలకు—విలాస వస్తువులు కొంటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కన్య:** అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**తుల:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు సంతోషకరమైన వార్తలను వింటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం:** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమ పడినా, ప్రయోజనం ఉండదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆందోళన కలుగుతుంది.

**మకరం:** ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారంమధ్యలో రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది. ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కుంభం.** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల మున్ముందు కూడా ఉపయోగం ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాటివారితో మాటపట్టింపులు తగవు.

**మీనం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన కృషి చేయవలసి వస్తుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరుతాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

—మహేష్






'శ్రీరామాంజనేయయుద్ధం నాటకం లోని పద్యాలు మైక్‌లోంచి వినపడుతున్నాయి. హాలుముందు జనం క్రమక్రమంగా ప్రోగవుతున్నారు. అందరికన్నా ముందుగా 'డైమన్‌డబ్బా' వాడు వచ్చి తన అట్ట పరచి దీపాలు వెలిగించి డబ్బాను గలగల లాడించడం మొదలుపెట్టాడు. నాటకం చూడాలని వచ్చిన వాళ్లలో కొందరు 'డైమన్‌డబ్బా' వద్దకు వెళ్లారు...

టీ కొట్టువాడు కంచుగ్లాసులో స్పూన్‌వేసి గణగణ లాడిస్తూ కుంపటి వూదసాగాడు. రెండు మూడు బుట్టల్లో పులి బంగరాలు, వేగోడీలు, గారెలు వున్నాయి. ఓ ప్రక్క సిగరెట్లు, బీడీలు, చుట్టలు, వక్కపొడి పొట్లాలు వున్నాయి. డబ్బుల డబ్బాలో డబ్బులు చప్పుడు చేస్తూనే వున్నాయి. స్టేజి పూర్తయింతర్వాత సీనరీలు, తెర తగిలిస్తున్నారు కొందరు...మొత్తానికి అది ఓ హాలులా తయారైంది...వెన్నెల లోపల నిరాటంకంగా పడుతుంది.

శ్రీకృష్ణ పాత్రధారి 'సారధి' అరేంజ్‌మెంట్స్ చూస్తూ తగిన సలహాలు యిస్తున్నాడు.

రాత్రి తొమ్మిది గంటలయింది. అయినప్పటికీ 'అర్జునుడు అయిపులేడు' డ్రామా వేయించే విశ్వేశ్వరయ్య మేనేజిమెంటు గాభరా పడింది. 'గయోపాఖ్యానం' లో అర్జునుడు లేకపోతే ప్రదర్శనం ఆగిపోతుంది. ఏమిచేయాలో మేనేజిమెంటుకు బోధపడలేదు. అందుకు తగినట్లుగనే ఆకాశంలో నల్లనిమేఘాలు ముమ్మరంగా గుమికూడాయి. పంట కోత కొచ్చిన అదనులో మేఘాలు కనుపిస్తే బీదరైతు ఎలా తల్లడిల్లిపోతాడో అలా తల్లడిల్లారు మేనేజ్‌మెంట్‌వారు.

హాలు పరిసరాల్లో అంతకుముందు వున్న వారేగానీ గ్రామంనుంచిగానీ, యితర గ్రామాల నుంచిగానీ జనం

మబ్బుల్ని చూసి ఆగిపోయినట్లున్నారు.

హాలు ముందు డైమన్ డబ్బీ గలగలలాడుతూ వుంది. 'కట్టు నల్లగుండు, యిస్పేట్, కళావర్...' అంటున్నాడు వాడు. చాలా మంది వాడి చుట్టూ మూగారు. మొత్తానికి వాడి కలక్షన్ బాగుంది.

వేడి వేడి వేరుశెనగకాయలు చల్లగాలికి చల్లబడిపోయినా వాడు మాత్రం అలవాటుపడ్డ అరుపును అనడం మానలేదు. మైక్‌లో నుంచి పాటలు మాత్రం జోరుగా వస్తున్నాయి.

ఆకాశం కారుమబ్బులతో నిండిపోయింది.

అప్పుడప్పుడు మెరుపులు, దానివెంట ఉరుములు బయల్దేరాయి, నాటకం ఎలా జరుగుతుందో చూద్దామన్నట్టుగా.

అంతవరకు అక్కడ చేరిన వారిలో 'వర్షం తప్పదు' అనే భావం స్థిరపడింది. నాటకానికని తెచ్చిన డబ్బుల్ని డైమన్ డబ్బాలో వేసి తమ అదృష్టాన్ని పరీక్షించుకునేందుకు వెళ్తున్నారు. కొందరు టీ కొట్టు చుట్టూ ముట్టడి వేసారు.

అర్జున పాత్రధారి అర్జునరావు అంతులేడు...పోన్లే యెటూ ఎలా ప్రదర్శనం ఆగిపోయేటట్లుంది. ఆ పాత్రధారికిచ్చే డబ్బు మిగిలిపోయింది — అనుకున్నారు మేనేజ్‌మెంట్‌వారు.

ఉన్నట్టుండి డైమన్ డబ్బీ దగ్గరుండే డబ్బా దీపాలు ఆరిపోయాయి. టీ కొట్టులోని కుంపటిలో నిప్పులు చిటచిటలాడుతూ రవ్వలు స్థానభ్రంశం చెందాయి... పెద్ద గాలి వీయడం ప్రారంభమైంది, కరంటు ఫెయిలయింది.

పది నిముషాలు భీభత్సంగా వాయు విజృంభణం జరిగిన తర్వాత ప్రకృతి శాంతించింది.... విద్యుత్ సరఫరా అయింది...ఆకాశాన మచ్చుకైనా నల్ల మబ్బు లేదు. ప్రశాంత వాతావరణం యేర్పడింది.

మైక్ హై వాల్యూంలో పాడుతుంది.

గంట పదయింది. బుకింగ్ యింకా తెరవలేదు. ముందుగా టిక్కట్లు కొన్నవారు హాల్లో కూర్చోవాలని తొందర పడుతున్నారు. అర్జునుడు రాలేదనే విషయం అంతవరకూ దాచగలిగారు. ఆ గ్రామంలో ఎవరేనా గయోపాఖ్యానంలోని అర్జునుడి పద్యాలు పాడేవారున్నారేమోనని అన్వేషణకు పోయారు కొందరు. అర్జునుడు ఆబ్సెంటని ఎలాగో తెలిసిపోయింది.

డైమన్ డబ్బాలో డబ్బులు పోగొట్టుకున్న ప్రముఖులు సహితం హాలుమీదకు దండయాత్ర చేసారు.

'బుకింగ్ తెరవండి !' కొంతమంది అరిచారు.

'అర్జునుణ్ణి చూపెంచండి!'

రెచ్చిపోయిన కొందరు హాలుచుట్టూ కట్టిన తడికలను లాగివేయాలని ప్రయత్నిస్తే, కొందరు త్రాగితందనా లాడుతూ బూతులు తిట్టడం ప్రారంభిస్తే, టికెట్స్ తీసికొని డబ్బు వాపస్ చేయమని మరికొందరు దబాయించసాగారు.

మేనేజిమెంటు గడగడ లాడింది. జవాబు చెప్పలేకపోయింది. ఇంతలో దడదడలాడుతూ వో టాక్సీ హాలుముందాగింది.

అందులోనుంచి అర్జునుడు దిగాడు. ఆయాసపడుతూనే విషయం తెలుసుకుని అందరిని శాంతపరిచాడు. మేనేజిమెంటు వారివైపు సగర్వంగా చూశాడు.

'ఆలస్యమైందిగదూ ! సాయంత్రం లాస్ట్‌బస్ తప్పిపోయింది. టాక్సీ వేసుకుని వచ్చాను. ఇదీ మధ్యలో చాలా ట్రబుల్ యిచ్చింది... ఎలాగో సకాలానికి చేరాను... టాక్సీవాడికి ఫేయిర్ యిచ్చి పంపండి' అని గ్రీన్‌రూం అనబడే ఆ పాకలోకి వెళ్లిపోయాడు సకాలానికి వచ్చానని సగర్వంగా చెప్పుకునే ఆ సత్పురుషుడు.

మేనేజిమెంట్ వారు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు—ఎవరి చేతిలోనూ టాక్సీ వాడికిచ్చేంత డబ్బు లేదు.

'నాటకం చూడు... అయింతర్వాత నీ డబ్బు నీకు తప్పక యిస్తాం' అన్నాడు మేనేజిమెంటులోని పెద్ద విశ్వేశ్వరయ్య.

'వీల్లేదండి! యిప్పటికే చాలా ఆలస్యమైపోయింది ... యిలాంటి డ్రామాలు చూడాలంటే నా కిష్టంలేదు. తలనొప్పి వస్తుంది. అంతేగాదు యే కారణంవల్లనైనా నాటకం ఆగిపోయి గలభా జరిగితే ఈ మొరటు మనుష్యులు నా కారుని గుజ్జు చేస్తారు' అన్నాడు చార్‌మినార్ సిగరెట్ పొగ పీలుస్తూ గొట్టం ప్యాంట్ టాక్సీ డ్రైవర్ కాలర్ సర్దుకుంటూ.

ఈ సంఘటనలన్నీ చూశాక సారథి మనస్సు బాధపడింది.

'బుకింగ్ తెరవండి ! వసూలైన సొమ్ములో ముందు టాక్సీడ్రైవర్ని పంపెయ్యి' అని మేనేజిమెంట్‌వారికి ధైర్య వచనాలు చెప్పాడు సారథి.

బుకింగ్ తెరిచారు. అరవైయిదు రూపాయిలు లొచ్చాయి.

'సమయానుకూలంగా రేట్లు పెంచబడును' అని నోటీసుల్లో వ్రాయించిన దానికి భిన్నంగా రేట్లు తగ్గించి అమ్మమని సలహా యిచ్చాడు సారథి.

మైక్‌లో రేట్లవివరం అనేక పర్యాయములు చెప్పబడింది. టాక్సీడ్రైవర్ కివ్వాల్సినది యిచ్చేసారు, వాడు సిగరెట్ త్రాగుతూ ఎవరితోనో బాతాఖానిలో పడ్డాడు.

'సారథిగారూ ! మీరు ఓసారి అర్జునుణ్ణి ఒప్పించండి !' అని ప్రాధేయపడ్డాడు విశ్వేశ్వరయ్య.

'ఏం ?' ఆశ్చర్యపోతూ అడిగాడు సారథి.

'ఆయన ముఖానికి రంగు పూసుకోవటం లేదు.'

'ఎందుకని ?' పరిస్థితి కొద్దిగా అర్థమైంది సారథికి.

'ముందుగా డబ్బు...' నీళ్లునములుతూ అన్నాడు విశ్వేశ్వరయ్య. తనకూ అడ్వాన్స్ తప్ప మరేమీ ముట్టలేదు. అయినా తాను వేషం వేసుకున్నాడు. తనకు తెలుసు పరిస్థితి. అలాగే కొంచెం ఆలస్యంగా వచ్చినా అర్జునరావుకు కూడా తెలుసు. కానీ యిలా మొండిపట్టుదల పట్టడంటే—అర్థంగాక సారథి అర్జునరావుని సమీపించాడు.

'అర్జునరావ్ ! మేకప్ కానివ్వు. టైమవుతుంది ... ప్రేక్షకులు ఈలలు వేయడం వినిపించలా ?' అన్నాడు సారథి.

సుభద్ర మేకప్ పూర్తిచేసుకుని అద్దంలో తన అందాన్ని, అలంకరణను చూసుకుంటూ వుంది యేదో రాగమాలాపిస్తూ.

'టైమవుతుందని తెలుసు సారథీ !... ఏదీ మనకింకా డబ్బు ముట్టందే !' అన్నాడు.

సారథి ఆప్యాయంగా అతని భుజంపై యివేసి—'చూడు అర్జున్‌రావ్! మబ్బులు కమ్మటంవల్ల జనం నాటకం జరగదని భావించి సరిగా రాలేదు. ఇలాంటపుడు విశ్వేశ్వరయ్య యేం చేయగలడు చెప్పు. ఆయన యెంత నష్టపడుతున్నాడో అర్థం చేసుకో. ఆయన స్థానంలో నువ్వుంటే యేం చేసేవాడివి చెప్పు! నువ్వు ఎచ్చిన టాక్సీకి డబ్బుల్లేక బుకింగ్ వోపన్ అయింతర్వాత యివ్వాల్సి వచ్చింది... కమాన్ రంగు వేయించుకో...కానివ్వు... మేమంతా సిద్ధం కాలేదూ!' అన్నాడు.

'మీ విషయం వేరు...' అన్నాడు తల బిరుసుగా అర్జునరావు, పైగా కొద్దిగా త్రాగికూడా వున్నాడు.

సారథికిసారి కోపం కలిగింది—'మీ విషయం వేరు' అనడంలో 'మీ రంతా నటనా సామర్థ్యం లేనివాళ్ళు. నేనొక్కణ్ణే మహానటుణ్ణి. మీరు ముఖానికి రంగు పూసుకుని స్టేజి ఎక్కితే చాలు యింకేమి అక్కర్లేదని దానికే మురిసి పోయే అల్పులు!' అనే నిరసన, తుస్కార భావం వుందనుకున్నాడు.

'సర్లే! మేమేదో జూనియర్లం... అర్జునరావ్! నువ్వు రాలేదని తెలిస్తే జనం యెంత భీభత్సం చేయబోయారో నీకు తెలుసు. నీవల్ల నాటక ప్రదర్శనం ఆగిపోతే ప్రేక్షకులు యెంత పైశాచికంగా ప్రవర్తిస్తారో వూహించు. ఈ కుర్చీలూ, బెంచీలూ విరగ్గొట్టారు. హాలు తగుల బెట్టేందుకైనా వెనుదీయరు. ఎందు కంటే హాలు వూరికి దూరంగా వుంది. ఊళ్ళోనేవుంటే చుట్టుప్రక్కల యిండ్లు తగలబడ్తాయని జంకేవారు.

# బాగుపడే దెప్పుడు?

'అర్జున్‌రావ్! విశ్వేశ్వరయ్య నాటక ప్రదర్శనాభిలాషి. అలాంటి వాళ్ళు వుంటేనే మనలాంటివాళ్ళు బ్రతుకు తారు. వాళ్ళే లేకపోతే మనం వీధి నాటకాలు వేసుకునేందుకుకూడా పనికిరాము ఆంధ్ర నాటక కళామతల్లి పచ్చని మాంగల్యంతో పసుపు కుంకుమలతో కళకళలాడ్తూ వుండాలంటే విశ్వేశ్వరయ్య లాంటివాళ్ళు నష్టపడిపోకూడదు. కళాకారులమైన మనమే విశ్వేశ్వరయ్య పరిస్థితి నర్థంచేసుకోలేక సానుభూతి చూపి సహకరించకపోతే యేం బావుంటుంది చెప్పు.

'నువ్వీ వేషం వేయాల్సిందే. లేకపోతే నీ తల్లిలాంటి ఆంధ్ర నాటక కళామతల్లిని అవమానించినవాడవుతావు. ద్రోహం చేసిన వాడవుతావు...లే! రంగు పూయించుకో!' అన్నాడు ఆవేశంగా సారథి.

'ఇదో మిష్టర్ సారథి! నీకు యిలాంటి విశ్వేశ్వరయ్యలాంటివాళ్ళ విషయం పూర్తిగా తెలుసు...నాటకం అయిం తర్వాత లేనిపోనివన్నీ కల్పించి, హాలు ఫుల్లయినా కలెక్షన్ నిల్లని...అందరూ ఫ్రీగా వచ్చినవాళ్ళేనని...నష్ట మొచ్చిందని ఏడుపు ముఖంతో పదో పరకో చేతిలో పెట్టి పంపుతారు...ఏంచేస్తాం అప్పుడైతే వచ్చినవరకూ జమ అని తీసుకోవాల్సిందే. ఎందుకైనా మంచిది. ముందుగా వసూలు చేసుకోవడం ఉభయ శ్రేయస్కరం...బ్రదర్! అనుభవంమీద చెపుతున్నాను. అంత్య నిష్ఠూరంకన్నా ఆది నిష్ఠూరం మంచిది' అన్నాడు అర్జున్‌రావ్.

'అయితే నీ నిర్ణయం మారదా?' సారథి కోపంగా అన్నాడు.

'డబ్బు చేతిలో పడందే మారడం దుర్లభం!'

'నిన్ననుకుని లాభం లేదు ...నీ లాంటి వాణ్ణి కరుణించి బాగా అభినయం చేయగలిగి, పాడగలిగిన శక్తినిచ్చిందే ఆ కళామతల్లి ననుకోవాలి...సరే! యింక నీకెంత రావాలో చెప్పు నే నిస్తాను' అన్నాడు సారథి.

'అడ్వాన్సు యిచ్చింది ముప్ఫయి... మిగిలిన ఎనభైఆరు యిచ్చేయ్'

'అలాగే! ఆ ఎనభైఆరులో టాక్సీ ఛార్జి పాతిక పోతే మిగిలింది నే నిస్తాను... లేచి రంగు పూయించుకో!' అన్నాడు సారథి.

'టాక్సీ ఛార్జి అందులోంచి తీసెయ్యడం భావ్యంగాదు' అన్నాడు అర్జునరావు మెత్తపడుతూ.

'ఎందుక్కాదు? నిన్ను బస్‌లో రమ్మన్నారుగానీ టాక్సీలో ఎవరు రమ్మన్నారు. నీ యిష్ట మొచ్చినట్లు హెలికాప్టర్‌లో వస్తానంటే ఆ సొమ్ము ఎవరు భరిస్తారు?' తీక్షణంగా అడిగాడు సారథి.

'సారథీ! నేను టాక్సీ వేసుకుని వచ్చి విశ్వేశ్వరయ్యను కాపాడాను లేకపోతే చాలా నష్టం జరిగేది.'

'నిజమే అర్జున్‌రావ్! బాగా డబ్బు వచ్చుంటే విశ్వేశ్వరయ్యగారు టాక్సీ ఖర్చు భరించేవారే ... యేం చేద్దాం!' అన్నాడు.

'సరే! మిగిలిందేది? యిలా యివ్వు?' అడిగాడు చేయిచాపి.

'ఇప్పుడు మాత్రం నాదగ్గ రెక్కడుంది తర్వాత యిస్తాను.'




CINTHOL
DEODORANT
LUXURY
TOILET P
జి.11 గల
సింథాల్ మీకు
రక్షణ యిచ్చినట్లు
వేరే ఏ
పౌడరూ
యివ్వలేదు.

# బాగుపడే దెప్పుడు?

'అయితే నీక్కూడా ముట్టలేదన్న మాట!' అన్నాడు ఆశ్చర్యపోయి.

'లేదు! కానీ! ఆలస్యమై పోతుంది' అన్నాడు సారధి.

'ఐయాం సారి బ్రదర్!' అని గబగబ మేకప్‌మాన్ ముందుకుపోయి కూర్చున్నాడు అర్జున్‌రావ్.

తన కాళ్లు పట్టుకున్న విశ్వేశ్వరయ్యను చూసి సారధి ఉలిక్కిపడ్డాడు.

'విశ్వేశ్వరయ్య గారూ! మీరు పెద్దవారు...యేమిటిది? లేవండి!' అన్నాడు లేవదీస్తూ.

'కాదు బాబూ! మీరు సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మలే — ఆనాడు ద్రౌపదిని అవమానంనుంచి కాపాడినట్లు నన్నినాడు కాపాడావ్, నన్ను రక్షించారు. సారధిబాబూ! మీ మాటలవల్ల మేరు పర్వతంకూడా చలిస్తుంది. మహాసముద్రాలైనా క్షణం స్తంభించి పోతాయి. మీ వాక్కులో అంత అమోఘమైన శక్తి వుంది...' అన్నాడు ఆనందాశ్రువులు స్రవిస్తుండగా విశ్వేశ్వరయ్య.

శ్రీ కృష్ణుని వేషంలో వున్న సారధి విశ్వేశ్వరయ్యకు ధైర్య వచనాలు చెపుతూ దూరంగా తీసుకపోయాడు,

సుభద్ర సారధి — విశ్వేశ్వరయ్యలను చూస్తూ వుండిపోయింది.

'సారధి వ్యక్తిత్వం, మూర్తిమత్వం సుభద్రకు నచ్చాయి, సారధి నచ్చాడు. సారధితో అంతగా పరిచయం లేకపోయినా—యీ నడుమ నాలుగైదు నాటకాలలో యిద్దరి కాంబినేషన్ కుదిరింది.

కమ్మని కంఠస్వరం, చక్కని అభినయంతో ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేసి మైమరపించే శక్తి సారధి కుంది. ఈ నడుమ రంగస్థలంపై సారధి ప్రవేశించగనే హాలంతా ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో మారోమ్రగిపోయేది. సారధి స్వతహాగా అందగాడు. శ్రీ కృష్ణ పాత్రలో అతడు జీవిస్తాడని కొందరంటే—అతనిలోనే శ్రీ కృష్ణ పాత్ర జీవిస్తుందని మరి కొందరు అంటారు.

సారధి వివాహితుడు. భార్యా, యిద్దరు పిల్లలున్నారని సుభద్రకు తెలుసు—సారధికి మరేం వుద్యోగం లేదు. నాటకాలాడ్డమే అతని జీవనోపాధి. ఈ నడుమ బాగా పేర్లోకి వచ్చాడు. పైగా తీసుకునే కట్నం విషయంలో ఖచ్చితం లేకపోవడం వల్ల ప్రతి నాటక కంపెనీ సారధినే బుక్ చేసుకొంటున్నాయి. అందువల్ల యీ నడుమ రోజుమార్చి రోజు గానీ, రెండు రోజులకోసారి గాని ప్రోగ్రాం వుంటునే వుంటుంది. వస్తుతః మంచివాడు, సహృదయుడు కావడం వల్ల డిమాండ్ పెరిగింది. సారధి బిజీ ఆర్టిస్ట్ అయిపోయాడు.

అర్జునరావ్ మేకప్ పూర్తయింది ... మరో సారి సీసా మూతివిప్పి నోటి కంటించుకున్నాడు...ఎంత సేపటికీ తీయకపోవడం గమనించి సారధి లాగివేసాడు.

'బావా! యిక చాలు — ఎక్కువైతే తబ్బిబ్బవుతావు పదపద 'నాటక ఫక్కీలో అని సీసా మూసాడు సారధి.

అప్పటికే కాస్త ఎక్కువే పడింది డోస్.

అర్జునరావ్ కళ్లు అరుణవర్ణం దాల్చాయి. నిషా ఎక్కువై తూలి పడబోయి నిలద్రొక్కుకుని సారధి వైపు చూసి నవ్వాడు.

'అర్జున్‌రావ్! త్రాగకుండా స్టేజీ ఎక్కలేవు...యేం చేస్తావ్? మోతాదుగా పుచ్చుకుంటే యీ అవస్థ వుండదుగా' అన్నాడు.

'సారధి! అలవాటయిపోయింది ... అయినా నీకేం భయం అక్కర్లేదు నేను బాగా నిలబడి పాడగలను...చూపించమంటావా?' అన్నాడు రాగమాలాపించబోయి.

'ఇప్పుడు వద్దులే ...టైం అవుతుంది ... ఆఖరుగంట కొట్టండి!' అని స్టేజీమీదకు వచ్చాడు సారధి, అందర్నీ తీసుకుని. ఆర్కెస్ట్రా సిద్ధమైంది. హార్మోనిస్టు ఆఖరుసమ్మలాగి బీడి సవతల పారేసాడు. తబలిస్టు సుత్తి తీసుకుని తబలాను సరి చేసుకోవడం మొదలుపెట్టాడు అప్పుడు.

రికార్డులు ఆపివేసారు.

సారధి కర్పూరం వెలిగించాడు తెర వెనుక.

'పరబ్రహ్మ'...తో తెర తొలగింది.

విశ్వేశ్వరయ్య — 'ఎంతమంది డోస్ ఫ్రీగా ఎచ్చేది?' అని పెద్దగా గెట్టు

గ్గర అరుస్తున్నాడు.

మామూలుగా గౌరవనీయులకు యిచ్చే కాంప్లిమెంటరీ పాస్‌లుగాక, పబ్లిసిటీకై వెళ్ళిన రెండెడ్లబండివాడి తరపున కొందరు, గేట్లదగ్గర టిక్కట్లు పుచ్చుకునేవాళ్ళ తరపున మరికొందరు, నటీనటుల తరపున కొందరు మైక్‌వాడి తరపున యిద్దరో ముగ్గురో, డెకరేషన్ పార్టీవాళ్ళు, వాళ్ళతరపున సభ్యులు... యిలా సగంమందిదాకా ఫ్రీగనే నాటకం చూడాల్సివచ్చింది.

ఇంకా తడిక కన్నంలోంచి దూరి వచ్చేవాళ్ళు, హాలుకు స్థలాన్ని యిచ్చిన వాళ్ళు ... వీళ్ళతోనే హాలు సగం నిండుతుంది.

నాటకం జోరుగా సాగుతుంది. హాలులో వెన్నెల నిరాటంకంగా కురుస్తుంది ... టిక్కట్లు కూడా షుమారుగా అమ్ముడుపోతూనే వున్నాయి. రెండెడ్లబండ్లపై కొంతమంది వస్తూనే వున్నారు.

హవుస్ ఫుల్లయింది— కలక్షన్ డల్ అంటుంది మేనేజిమెంటు. విశ్వేశ్వరయ్య డబ్బులు లెక్క చూసుకుంటూ వున్నాడు.

వెనుక వరుసల్లోనివాళ్ళు మెల్ల మెల్లగా ముందు వరసలోకి దూకుతున్నారు.

డైమన్ డబ్బావాడు దీపాలు ఆర్పేసి— అట్ట కట్టేసాడు. చాలా డబ్బులు పోగొట్టుకున్నవాడొకడు బీడి ఖర్చుకు బతిమిలాడుతూ వున్నాడు ... వాడు పస్తే మిరా అంటున్నాడు.

గేట్లు వదిలేస్తారు ... నాటకం సగం మంచయినా చూడొచ్చు అనుకున్నవారు మెయిన్‌గేట్లుముందు తారట్లాడుతూనే వున్నారు.

బుకింగ్ మూసివేసారు. విశ్వేశ్వరయ్య లెక్క చూసుకుని హాలు బయటకువచ్చి చూసి గేట్లు తెరిచేయండని చెప్పాడు.

బయట వున్నవాళ్ళంతా లోపలికి జొరబడ్డారు. డైమన్ డబ్బావాడు కూడా లోపలికివచ్చి కూర్చున్నాడు.

ఈలలు — అరుపులు మధ్య మధ్యలో ఒన్స్‌మోర్‌లతో ఆర్టిస్టులు విసుగుజెంది అలసి పోయారు.

సారధి, అర్జున్‌రావ్, సుభద్రలు రసవత్తరంగా నటించారు. సుభద్ర రాయబారం బావుందని సారధి మెచ్చుకున్నాడు.

నాలుగవుతుందనగా నాటకం ముగిసింది—సినిమా పాటలు పాడమని ప్రేక్షకులు బలవంత పెట్టేసరికి చేసేదేంలేక సుభద్ర పాడవలసి వచ్చింది. నాటకంలో సినిమాపాటలు పాడమనేసరికి సారధి కొంచెం బాధపడ్డాడు. జనం పలుచబడ్డారు. కొందరు సుభద్రచుట్టూ చేరి ఏవో అడుగుతున్నారు. సుభద్ర చేతులెత్తి నమస్కారం చేసి బతిమాలిం తర్వాత ఆ కొందరుకూడా వెళ్ళిపోయారు.

అందరూ వేషాలు తీసివేసి ముఖం కడుక్కున్నారు.

'సారధిగారూ ! యీ నాటకంవల్ల నేను నష్టపోలేదు...అదే నాకు వచ్చిన లాభం...యిక మీకు...' అంటూ విశ్వేశ్వరయ్య కొంత డబ్బు యిచ్చాడు. సారధి లెక్క చూసుకున్నాడు—ఏభై రూపాయలు.'

'మరేమనుకోకండి ! నన్నేం చేయమంటారు...దానికి దానికి సరిపోయింది ...యింకా చేతిడబ్బులు పడేటట్లున్నాయి;' అన్నాడు దీనంగా 'కలక్షన్ బాగానే వున్నట్లుంది !' అన్నాడు సారధి జేబులో డబ్బు పెట్టుకుంటూ.

'అందరికి ఎఫ్. ఎస్. లే ఫ్రీగా ఆఖరున అందర్నీ వదిలేసాం !' అన్నాడు.

'విశ్వేశ్వరయ్యగారు ! యీ పద్ధతి మార్చాలి ... నాటకం పూర్తయిందాకా గేట్లు మూసే వుంచాలి...ఎటూ కొంచెం జరిగింతర్వాత వదిలేస్తారు వెళ్ళి చూడొచ్చు అనే భావం చాలా మందికి వుంటుంది...దీనికి ప్రేక్షకులను అలవాటు పడనీయకూడదు.' అన్నాడు.

విశ్వేశ్వరయ్య చిన్న నవ్వు నవ్వాడు.

సుభద్రమాత్రం డబ్బు విషయంలో పేచీ పెట్టుకుంది. ఆమెకు మొత్తం డెబ్బయి రూపాయలు యివ్వక తప్పలేదు.

ఇలా చాలావరకూ తగ్గించి యివ్వడం జరిగింది.

'నే చెప్పలా ! అందుకే ముందుగా డబ్బు తీసుకోమన్నాను...డబ్బు తగ్గినవాళ్ళంతా విశ్వేశ్వరయ్య నెత్తి వెంట్రుకలు లాక్కోండి !' అని అర్జునరావు నవ్వాడు.

అర్జునరావు తన చేతిలో యాభై పెట్టడంతో ఖస్సుమన్నాడు.

'అంత చేతగానివాడివి యీ ప్రోగ్రాం పెట్టుకోకపోతే ఏమేం ?' మా బాధ నీకేం తెలుసు...స్టేజీమీద గొంతు చించుకున్నాం గానీ నీయింటికి ముష్టికి రాలేదు...ఇదో సారధీ! ఇలా తగ్గించి యివ్వడం కళాకారుణ్ణి అవమానించినట్లు కాదూ... మీ నాటక కళామతల్లిని అగౌరవ పరచినట్లు కాదూ! కళాకారుడి ప్రతిభకు తగిన పారితోషికం, ప్రతిఫలం యివ్వకపోతే కళామతల్లి హర్షిస్తుందా? ఇలా చేస్తూ వుంటే కళాకారుడు ఉత్సాహంగా ముందుకెలా వస్తాడు?...టాక్సీ డబ్బులు తగ్గించారు...యింకా తగ్గిస్తే నేను పుచ్చు



# బాగుపడే దెప్పుడు?

కోను...నువ్వా సరి పుచ్చుకోవచ్చు నీ విషయం వేరు...నాకూ నీలా యిద్దరే పిల్లలే అయితే నేను సరిపుచ్చుకునే వాణ్ణి, నాకూ నీలా యిూ సీసాల ఖర్చు లేకపోతే నేనూ సర్దుకుందును...సారధీ! నేనిస్తానని మాటిచ్చావ్...యిస్తే అంతా యిచ్చే టట్లు చూడు...ఆ!' అన్నాడు కోపంగా అర్జునుడు. సారధి విశ్వేశ్వరయ్య వైపు చూశాడు.

విశ్వేశ్వరయ్య జేబులోంచి డబ్బుతీసి—'రేపు యిూ కుర్చీలూ, బెంచీలు బస్‌లో పంపించేయాలి...ఆ లగేజ్‌కు, యిూహాలు ఖాళీచేయించేదానికి...మీకు కాఫీ ఖర్చులకు మిగిలాయి' అన్నాడు.

సారధి అర్జున్‌రావు చేతిలో తన జేబులోని డబ్బులోంచి పదకొండు రూపాయలు తీసి యిచ్చాడు.

సుభద్ర ఆశ్చర్యంగా సారధిని చూసింది...సిగ్గుపడిందికూడా తాను పేచీ పెట్టిన విషయం గుర్తుకు రాగానే.

'ఇక మీరు పదండి!' అన్నాడు విశ్వేశ్వరయ్య భారంగా. సారధి ప్రేమం చూసుకుంటూ ఆవులించాడు.

'ఇక జన్మలో మళ్లీ నాటకాల గొడవ యెత్తుకోను బాబూ!' అని విశ్వేశ్వరయ్య యెవరితోనో అంటుంటే విని సారధి బాధగా నవ్వుకున్నాడు.

'అమ్మగారూ! మీరిక వస్తారా?' అడిగాడు సుభద్రను ఓ ప్రబుద్ధుడు.

'ఎవరతను? ఎక్కడికి రమ్మంటున్నాడు?' సారధి సుభద్రను అడిగాడు.

'మాకు తెలిసినవారొకరు యిూ గ్రామంలో వున్నారు...పడుకునేందుకు వస్తానని చెప్పాను' అంది సిగ్గు నభినయిస్తూ.

సారధికి విషయం అర్ధం అయింది—ఆమెపై కోపంకూడా వచ్చింది. 'ఇలా రెండువిధాల సంపాదించడం మొదలుపెట్టబట్టే, నటీమణులు మేడల్లో వుంటున్నారూ, కార్లలో తిరుగుతున్నారు' అనిపించింది.

'వెళ్లయితే పడుకునేందుకు...మంచి పడక సిద్ధంచేసి వుంటారు...ఎన్నాళ్ల నుంచి తెలుసోమరి' అన్నాడు యిూసడింపుగా.

'అరరే! మీకిష్టం లేకుండా వున్నట్లుందే! అలా అయితే మానేస్తానులెండి! ...అరేయ్! నేను పడుకునేందుకు రానన్నానని చెప్పు...వెళ్లు...' అని సారధిని చూస్తూ క్రింది పెదవిని పైపంటితో కొరికింది సుభద్ర.

విశ్వేశ్వరయ్య చూపిన మేడ పైగదుల్లో శయనించారు అందరు. అర్జునరావు సీసామహిమతో యిహాన్ని మరచిపోయాడు. తెల్లారేందుకు యిక అరగంట వ్యవధి వుందనగ సుభద్ర సారధి దగ్గరకు వచ్చింది.

'ఏం? యిలా వచ్చావ్!' అన్నాడు సారధి అనుమానంతో.

'బావుంది! అంత పెద్దగా మాట్లాడా రెందుకూ? నేను ఆలస్యంగా వచ్చాననా... మరి అందరూ నిద్రపోవద్దూ!' అంది.

'అంటే?'

'సారధిగారూ! మీ అభిప్రాయం గమనించే నేనే అక్కడికి పడుకునేందుకు రానని చెప్పిపంపాను...మీరు నన్ను కోరుతున్నారు గదూ! అందుకే వచ్చాను... అటువైపుగా సామానులగది ఖాళీగా వుంది...వెళ్దాం రండి!' అంది. సారధి బాధగా నవ్వాడు!

'ఇదో అమ్మాయ్! మీరంతా యెందుకు నాటకాల్లో నటించి నాటక సంస్థకు నాటక కళామ తల్లికి, కళాకారులకు చెడ్డపేరు తెస్తారు?... మీ ఈ వ్యాపారం నిరాటంకంగా జరిగేందుకు ఈ నాటకాలని యెందుకు తెరచాటుగా చేసుకుని నాటక వ్యవస్థను కలుషితం చేస్తారు?

నీకు అందమైన రూపం, అందుకు తగ్గట్టుగనే తగిన అభినయంతోపాటు గాత్ర సంపదకూడా ఆ భగవంతుడిచ్చాడు. నీ అందంతో ప్రేక్షకులను అల్లరి చేయకుండా అదుపులో పెట్టాలిగానీ వెర్రి వాళ్లనుచేసి నీ పొందు కోరేలా, ప్రవర్తించకూడదు. నీ అభినయంతో ప్రేక్షకులు నాటకం చూస్తున్నామనే విషయం మరచి పోవాలిగానీ వెర్రిమొర్రి వూహలతో వారి అంతరంగం గంతులేయకుండా వుండేందుకు నీవు తగు శ్రద్ధ తీసుకోవాలి. నీ గానంతో వాళ్లు మురిసి పరవశులై నీలోని కళా నిపుణతను ప్రశంశించి పుత్రికాభావంతో ఆశీర్వదించేలా చేసుకోవాలి ... అప్పుడే నీవు చరితార్థవవుతావు.

అసలే మనకు రాత్రిళ్లు పని...అలసపోయి వుంటాము, ఆరోగ్యాన్ని దూరం చేసుకుంటూ వుంటాం. నువ్విలా ప్రతి ప్రోగ్రాంలో ఐహిక సుఖాలు చూసుకుంటే నీ ఆరోగ్యం యేం బాగుపడుతుంది చెప్పు. ఈ నాటకకళ యింత అధ్వాన్నంగా తయారయేందుకు కారణం మనమే. డబ్బు పడందే రంగు పూసుకోని వాళ్లు, సీసాలేందే స్టేజీ ఎక్కనివాళ్లు యిలా నీలాంటి వాళ్లూ వుండబట్టే మన ఆంధ్రనాటక రంగం గ్రామసీమల్లో యిలా అఘోరిస్తుంది. డ్రామా నటీనటుల పేరు



ప్రతిష్టలు మంటగలసి పోతున్నాయి. నాటక కళాకారులయెడ చులకనభావం ప్రబలంగా పెరిగిపోవడానికి మన ప్రవర్తనే కారణం అవుతుంది.

పసివానవు, పైకి రావలసిన దానవు... మద్యం సీసాను నోటికి చేర్చడం నేను చూశాను. నిషా లేందే నటించడం రాదా? గొంతు పెగలదా? నా నటనను అందరూ మెచ్చుకుంటున్నారే-ఒన్స్‌మోర్‌లు కొడుతున్నారే ... నేను త్రాగుతున్నానా? లేదే! ఈ దురలవాట్లన్నీ మానుకుని పరిస్థితుల నర్థం చేసుకుని విశ్వేశ్వరయ్యలాంటి వాళ్లతో సహకరించి సర్దుకపోతూంటేనే మనం నాటకాలు వేయగలుగుతాం. అలాంటప్పుడే ఆంధ్రసీమలో అనేకమంది విశ్వేశ్వరయ్యలు పుట్టుకొస్తారు. నాటకవృక్షం కళకళలాడుతూ కొత్త చివుళ్లు వేస్తూ మహావృక్షం అవుతుంది.

'సుభద్రా! ఇక జన్మలో నాటకాల గొడవ ఎత్తుకోను బాబు' అని విశ్వేశ్వరయ్య అన్నాడంటే ... మనలను పోషించే వాళ్లల్లో ఒకరు కరువయ్యారన్నమాట— యిలా అయితే మనం కొద్దిరోజుల్లో గుగ్గిళ్లు అమ్ముకోవాల్సి వస్తుంది ... సారీ! మనం అన్నాను. మా మగవాళ్ల... మీకేం అందం వుంది. అందాన్ని ఆరాధిస్తున్నామని కొనేవాళ్లు చాలామంది వున్నారు...'

'సారధిగారూ!' ఉక్రోషంగా అంది సుభద్ర.

'ఏం? నేనేం తప్పన్నానా? చూడు సుభద్రా! స్త్రీ గౌరవంగా మనాలంటే డబ్బు ప్రధానంగాదు. శీలవతిగా ఉండాలి. మన ప్రాంతంలో అసలే మీలా వేషాలు వేసే స్త్రీలపై సదభిప్రాయం లేదు.









క్కడ మీ నటనాచాతుర్యానికి, గానానికి వన్స్‌మోర్‌లు కొట్టినా, బయట, అది—యిది—అంటూ బూతులు వాడుతూ అసహ్యంగా భావిస్తుంటారు.

నాకు తెలిసినంతలో ఒకామె ప్రోగ్రాం అయింతర్వాత డబ్బు కాశించి తొలిసారిగా మేనేజిమెంటువారిలో ఒకడికి పడక సుఖమిచ్చింది... కాని మేనేజిమెంటువారందరూ

# బాగుపడే దెప్పుడు?

ఒకరి తర్వాత ఒకరు ఆమెను భ్రష్టు పట్టించారు. అది మొదలు ఆమె నాటకాలాడ్డం మానేసింది. ఆంధ్రనాటక ప్రేక్షకులు ఒక మంచినటి నటనను చూసే అవకాశం పోగొట్టుకున్నారు. మరో





ఆమె రెండువిధాల సంపాదిస్తూ విచ్చలవిడిగా విహరించి అనారోగ్యంతో, వళ్లంతా పుట్టెడు రోగాలతో పతనమైపోయింది. నిరాశ్రయమైపోయి వీధివీధిన అడుక్కుతింటుందంటే నువ్వు ఆశ్చర్యపోతావు.

నువ్వయిలా వుంటే నీకూ ఆ స్థితి తప్పక వస్తుంది. నువ్వు మంచి నటివి. అసలే ఆంధ్ర దేశంలో లేడీ 'ఆర్టిస్టులు తక్కువ... అందుకే నా బాధ. మనం నాటకరంగాన్ని వుద్ధరించేందుకు కంకణం గట్టుకోవాలి...ఇదంతా నీకెందుకు చెపుతున్నానంటే నీ బాగు కోసమే నమ్మ! కలకాలం ఆంధ్ర నాటక సీమలో నువ్వు ధ్రువతారగా వెలిగి పోవాలనే సోదరి భావంతో యిదంతా చెపుతున్నాను...' అని ఆగాడు సారధి.

సుభద్ర సారధిని తీక్షణంగా చూసి విసురుగా వెళ్ళిపోయింది...

సారధి తాను వృధాగా యింతసేపూ ప్రయాసపడ్డాననుకొని బాధగా నవ్వుకుని ఒత్తిగిలి పడుకున్నాడు బద్ధకంగా, భారమైన మనస్సుతో. అక్కడ విశ్వేశ్వరయ్య చొక్కా లోపలి జేబులోంచి డబ్బు తీసి లెక్కపెట్టి హాయిగా నిట్టూర్చి ఓసారి మీసాలపై గర్వంగా చేయివేసి, డబ్బు భద్రపరిచాడు. తాను మహానటుణ్నని మురిసిపోతూ!

మరి అందరూ యిలా వుంటే ఆంధ్ర నాటక రంగం 'బాగుపడేదెప్పుడు?' సారధి లాంటి మహావ్యక్తులు ఎందరు కావాలో! ప్చ్!

* * *

(ఆంధ్రనాటక రంగం మరీ అధ్వాన్నంగా తయారైంది. యిలా తయారయ్యేందుకు ఎవరిలో వుంది లోపం? నటీనటులలోనా? కళా పోషకులలోనా? ప్రేక్షకులలోనా? లేక అందరిలో వుందా లోపం? మొత్తానికి అందరూ తప్పక తెలుసుకోవాలి! సరిదిద్దాలంటే ఏ ఒక్కడివల్లా వీలు కాదు. అందరిలో సంచలనం గలగాలి, మార్పు రావాలి. అప్పుడే ఆంధ్రనాటక కళామ తల్లి చిరునవ్వులు చిందిస్తుంది. అయితే ఆరోజు యెప్పుడో?') ●



ధర్మపథం



# ప్రేమలోని భేదాలు

బుడుసు వేంకటరమణయ్య

ఆయా స్వభావాలనుబట్టి మానవులను ముమ్విధంగా నిర్ణయించారు పెద్దలు-ఉత్తములు, మధ్యములు, అధములు అని. ఉత్తములు తమ పనులను మానుకొని అయినా ఇతరులకు కార్యసాధనలో తోడ్పడతారనీ, మధ్యములు తమపని చూచుకుంటూనే యితరులకూడా సహాయం చేస్తారనీ, అధములు తమ పని నెరవేరడంకోసం యితరుల కార్యాలకు భంగం కలిగిస్తారనీ భర్తృహరి మహాకవి సుభాషితాల్లో చెప్పి ఉన్నాడు. ఇది అందరికీ తెలిసిన విషయమే!

మానవులలో ఉన్నట్లే ప్రేమలో కూడా మూడు తరగతులున్నాయి. మొదటిది స్వార్థమైన ప్రేమ. రెండవది ఆనుషంగిక ప్రేమ. మూడవది స్వార్థరహిత ప్రేమ. వీటిలో మొదటిది అధమమైనది. రెండవది మధ్యతరగతిది. మూడవది ఉత్తమమైనది,

స్వార్థపరుడు ఇతరులను ప్రేమించవచ్చును అయితే అది నిజమైన ప్రేమ కాదు. అలా ప్రేమించకపోతే—ఎదుటివారివల్ల తాను కోరే అనుకూల కార్యాలు జరగవు. ఇంట్లో గృహకృత్యాలు చక్కగా జరగాలన్నా,సంసార సౌఖ్యం ఉండాలన్నా అర్థాంగిని ప్రేమించాలి. అనుకూలమూ, హితమూ అయిన వంట కావాలంటే పాదకుణ్ణి ప్రేమించాలి. ఇందులో తన సౌఖ్యమే ముఖ్యం. ఇతరుల కష్టసుఖాలతో పని ఉండదు. వాళ్లు బాధపడుతున్నా తనకు సౌఖ్యం చేకూరితే చాలు.

ఇక రెండవరకం వాడు — తన స్వార్థం సాధించుకోడానికే కాకుండా — తన ప్రయోజనానికి ఉపయోగపడే వారిపైని కొంత కారుణ్యాన్ని చూపుతూ ప్రేమిస్తాడు. ఇతనికి కేవలం స్వార్థం లేదనీ, తమమీదకూడా కొంత అభిమానం వున్నదనీ గ్రహించి— అతని కార్యాలను నెరవేరుస్తున్న అవతలి వారున్నూ అతనిపైని కొంత ప్రేమ కలిగి వుంటారు — కేవలం స్వార్థాన్నే చూచుకొనే వానిని ఎవ్వరూ ప్రేమించరు. అందువల్ల రెండవరకం ప్రేమ కొంతవరకూ పరస్పర ప్రేమ కాగలదనికూడా చెప్పవచ్చును.

మూడవరకం ప్రేమ స్వార్థరహితమైనట్టిది. ఈ పద్ధతిలో ప్రేమించే వ్యక్తి - ఏ పనికోసమూ ఇతరులను ప్రేమించడం లేదు, అతనికి నిష్కామమూ—నిర్హేతుకమూ అయిన ప్రేమ, అందువల్ల ఈ నిస్స్వార్థపరుడికి తనవారూ—పైవారూ అనే భేదమూ, జాతిమత భేదాలూ, వీరూ—వారూ అనే భేదాలూ ఉండవు. అందరినీ సరి సమానంగానే ప్రేమిస్తాడు. ఇతని ప్రేమ సువిశాలమైనది. ఇతడు అందరినీ ప్రేమిస్తూ వుంటాడు కాబట్టే అందరూ యితనిని ఎక్కువగా ప్రేమిస్తారు.

ప్రేమ అనేది ప్రతిజీవికి సహజం! అందులోనూ జ్ఞానం ఎక్కువ పాళ్లలో ఉన్న మానవుల్లో అది ఎక్కువగా ఉండడం ఎంతో స్వాభావికం. ఉండవలసిన ఆ ప్రేమను ఉత్తమపద్ధతిలో ఉపయోగించితే—స్వార్థరహితమయిన మార్గంలో వినియోగిస్తే మానవుడు సంఘంలో ఉన్నతస్థానాన్ని ఆక్రమించుకోగలడు. ప్రజలందరి ఆదరాభిమానాలనూ చూరగొనగలడు. అతని పదవితో మరి యే ఉన్నతపదవీ సమానం కాజాలదు.

వేణుగోపాలుని కన్నులనిండుగా వెన్నెల వన్నెలే తళుక్కు మంటున్నాయి. ఆ కరుణా విభవుని సన్నిధిలోనే 'భాస్కరం' జీవితంలో అగ్నిసాక్షిగా అర్ధాంగిగా అడుగు పెట్టాను. మనస్సున ఆ మంగళాకారుని మురళి మధురాతిమధురంగా మ్రోగుతోంది.

ఆయన డాక్టరు. నేను ప్లీడర్ని. బాధల్ని తొలగించడానికి ప్రయత్నించే మనస్సున్న మనిషి ఆయన. న్యాయం కోసం పోరాడాలని ఆశంతో వూగిపోతున్న వయస్సు నాది.

అమ్మకు వైద్యం చేయడానికివచ్చి 'లా', చదువుతున్నానని తెలియగానే ప్రశంసించారెంతగానో.

'మీలాంటివాళ్ళు మాటి కొక్కరైనా వుంటే స్త్రీ జాతి తప్పకుండా ముందడుగు వేస్తుంది. కరుణాదేవి !' అంటూ.

ఎప్పటినుంచో కలల నల్లుకుంటూ వూహల వూయలలో వూగిపోతూన్నాను ప్లీడర్ని కావాలని, అన్యాయాన్ని వోడించాలని. కానీ ఒక్క నాన్నగారు తప్ప అందరూ 'ఆడపిల్ల—అవ్వ—కోర్టులో నిలబడి బల్లగుద్ది వాదించుతుందా! ఛా! ఎంత సిగ్గులేని పని!' అంటూ విమర్శించి నోరు నొక్కుకునేవాళ్ళే. అందుకే భాస్కరంగారి ప్రశంసోక్తి వినగానే కొండంత ధైర్యం మేల్కొంది లోలోన. ఆయన ఎంతో సభ్యతగా మెలగేవారు.

పొరపాటునకూడా ఒక్క అసభ్యపు మాటైనా అనేవారుగాదు. పరిచయంలో వున్న చనువును పురస్కరించుకుని ఏనాడూ అతిగా ప్రవర్తించ లేదాయన. నామనస్సున వో మధురక్షణాన ఆ డాక్టరికై అనురాగం అందాల మందిరాన్ని నిర్మించింది నాకు తెలియకుండానే.

రెండుమూడుసార్లు ఆయన పని చేస్తూన్న హాస్పిటలుకి వెళ్ళాను నేను కూడా. ఎంతో మర్యాదగా పలుకరించారు. నవ్వుతూ ఆహ్వానించారు. ఆ నవ్వులో మధురిమలు సరిగమల్ని వూయించాయి. వెన్నెల కురిసిన ఆ చిరునవ్వు నాలో మధురోహల్ని పండించింది. ఆయన కన్నుల్లోకి చూస్తూ కావ్యాల నల్లుకో వచ్చని కలలు గన్నాను. కథలు సృజించుకో వచ్చని మురిసి, మైమరిచిపోయాను. అంత నిర్మలంగా వుండేవా చూపులు.

అమెరికాలో కొన్నాళ్ళు చదివి వచ్చారు. డాక్టరు. వెనుక తల్లీదండ్రీ లేరనీ చెప్పుకో దగిన బంధువులు కూడా లేరనీ చెప్పారు ఆ హాస్పిటల్లోవున్న రెండు సంవత్సరాల్లోనూ ఎంతో మృదుహృదయుడిలా ప్రవర్తించారు. రోగుల్ని కావలిసినంత సానుభూతితో పరీక్షించేవారు. ఎంతో ఓర్పుగా వినేవారు రోగులు చెప్పినదంతా.

ఆ వయస్సున అందమూ, ఆకర్షణా, చదువూ, హోదా అన్నీ వున్న ఆయనకుని పై ఎంతోమందికి ఆసక్తి పెరిగింది. నాన్నగారుకూడా ఆయన్ని ప్రత్యేకంగా చూసేవారు. ఇంట్లో ఏ చిన్న విందు జరిగినా ఆహ్వానించేవారు. ఛలోక్తులతో నవ్వించేవారు.

ఓనాడు 'మా కరుణను నీ చేతుల్లో పెట్టాలనుందోయ్!' అన్నారు. ఆయన వినమ్రంగా అంగీకరించారు.

నా మనస్సున మల్లెలుమాలలు నల్లుకున్నాయి. మధురోహల సందడితో నా హృది విరిసిన మందారమే అయ్యింది.

అమ్మకోరిక పై వేణుగోపాలుని ఆలయాన జరిగింది వివాహం. మరో మలుపు తిరిగిందా క్షణంతో నా జీవితం. మనస్సున నిలిచిన ఓ మధురమూర్తికి అర్పించుకున్నాను నా జీవన కావ్యాన్ని.

నాన్నగారు జడ్జికావడం మూలాన ఎన్నో కేసుల్ని నాచేతకూడా పరిశీలింపజేసేవారు. రానురాను పూర్తిగా ప్రతి కేసునీ పరిశీలించడం నేర్చుకున్నాను.

నాన్నగారిపేరు దూరతీరాలక్కూడా 'మంచి న్యాయవాది' అని వ్యాపించింది శ్రీమతి కరుణాదేవికూడా తండ్రికిదగ్గ కూతురేనన్న ప్రశంసకూడా బయల్దేరింది త్వరలోనే.

మరోవైపున శ్రీవారి సహకారం కొండంత. ఎంతో ఆనందంగా వుండేది నాకాయన సన్నిధి. ఇంటిదగ్గరున్నంత సేపూ 'కరుణా! కరుణా!' అంటూ కబుర్లతో హాస్యోక్తులతో కాలాన్ని పరువులెత్తించేవారు.

ఆరోజు నాడైరీలో—కాదు కాదు. జీవితంలోకే మరిచిపోలేని రోజు. దీపావళి. దీపాల పందిరిలా కనులపండువుగా వెలిగిపోతోంది లోకమంతా. మతాబాల వెలుగుల్లో పాపల వదనారవిందాల నిండుగా ఆనందం నృత్యం చేస్తోంది. యువకుల ఎడదల్లో వుత్సాహం పరవళ్ళు తొక్కుతోంది.

ఎవరో విందుకని ఆహ్వానించారు. వెళ్ళిన ఆయన యింకా తిరిగిరాలేదు. అమ్మగారింటికి వెళ్దామనుకునీ కారు లేకపోవడం మూలాన విరమించుకున్నాను. తోటలో కుర్చీ వేయించుకున్నాను. గేటు తీసిన చప్పుడైంది కొంతసేపటికి. పూల అందాల్ని చూస్తూ మైమరిచిపోయి వున్నానేమో, ఆ శబ్దానికి వులిక్కి పడ్డాను. ఆవేళలో ఎవరా వచ్చిందని ఆశ్చర్యపోయాను. బహుశః ఏ అర్జంటుకేసో వచ్చి ఆయనకోసం వచ్చారేమో ననుకున్నాను.

'లోపలికి రావచ్చునా?' అన్నదో యువతి లేత నీలిరంగు చీరలో వినయం మూర్తీభవించినట్లు నిల్చున్నదామె. ఆ సువిశాల నయనాల్లో నీలినీడలు పొరాడుతున్నాయి. విచారం గూడుకట్టుకుని వుందామూపుల్లో.

'రండి!' అన్నాను ఆశ్చర్యంనుంచి తేరుకుని. మరోకుర్చీ తెప్పించా నామెకోసమని. కానీ కూర్చోనే లేదామె ఎంతగా చెప్పినా. ఆ కళ్ళల్లో ఎందుకో భయం కదులుతోంది ఇంటివైపు చూస్తోంది మాటిమాటికీ. ఒకవేళ ఏదైనా తగాయిదాయేమో ననుకున్నాను.

'ఫర్వాలేదు కూర్చోండి. ఇక్కడికెవ్వరూ రారు. చెప్పండి అన్నాను. అప్పటికీ కూర్చునేప్రయత్నం కూడా చేయలేదామె. ఎవరో ఆమెను వెంటబడి తరిమి యిక్కడికి పంపించినట్లు భయంతో వణికిపోతోంది.

'మీరు...' ఎవరైనదీ తెలియక ఆగిపోయాను. అమాయకత్వం నిండిన ఆ కళ్ళతో నావైపు చూసింది ధైర్యం చేసి.

'నేను......నేను...మీకు దగ్గరి బంధువునే...వరుసకి అక్కయ్యనౌతాను' ఎవరో నేర్పినట్లు పాఠంలా వల్లించింది. ఆశ్చర్యపోయాను. అక్కయ్యనౌతానంటున్నదీ మా బంధువులంతా నాకు తెలుసు

వాళ్ళల్లో ఏ మారుమూలలోనూ అక్కయ్యలు లేరు. పోనీ ఆయనవైపు వాళ్ళా అనుకోడానికి ఏనాడూ ఒక్కపిట్టైనా వచ్చిన పాపానపోలేదు. అందుకే మాట్లాడలేక పోయాను వెంటనే. పల్లెటూరిలో పెరిగిన బంతిపువ్వులా అమాయికంగా వుందామె.

'ఈ వుత్తరాలు చూడండి దయచేసి—' అన్నది వణుకుతూన్న స్వరంతో. కూర్చోమని చెప్పాను మరోసారి. జాబును విప్పాను. 'డియర్ అన్నపూర్ణా!' అని వుంది.'

'అన్నపూర్ణ అంటే...'

'నేనే...ఆయన... మా బావే!' అన్నది నేరస్థురాలిలా తలవంచుకుని.

'ఆ! మీ బావా? నిజమేనా?' ప్రాణంవున్నా ప్రశ్నించాను.

'నిజమే! నేనసలు అబద్ధాలు చెప్పలేనండీ!' అంటూన్నట్లు దీనంగా చూసిందామె నా వంక. ఆ దీనత్వాన్ని చూడగానే నా హృదయం ద్రవించి పోయింది. రెండో జాబు విప్పాను, వరుసగా అయిదారు చదివాను.

ముత్యాల్లా అల్లుకుని వున్నాయి అక్షరాలన్నీ. తీయని వూహాలు హాయిని కురిపించే మలుపులతో మనస్సును ఝుల్లుమన్పించుతున్నాయి. మృదువైనభావాలు. మధురాతి మధురమైన పద్యాలు. పద్యాల నిండుగా అనురాగం అమృతమై ప్రవహించుతోంది. వలపు నిండిన హృదయాన్ని పదాల్లో పరచినట్లుంది.

చివరివుత్తరం తీశాను. దానిలోపలి నుంచి వో ఫోటో జారి నా వొడిలో పడింది. చూశాను తీసి — నన్ను నేనే నమ్మలేక పోయాను. అలాగే బొమ్మలా చూస్తుండి పోయానెంతో సేపటివరకు. ఎదుట వో మనిషివున్న మాటే మరిచిపోయాను.

జాబులోకి వంగింది హృదయం. పరమ విరోధికి వ్రాసినట్లుంది—

'చదువూ, అందం, కీర్తి, హోదా ఎన్నో వున్నాయి నాకు. ఎది ఏదో తెలుసుకోలేని పసితనంలో పెళ్ళాడాను. తెలిసిన తర్వాత నా విచారానికి అవధులే లేవు. అందం లేదు. అర్థం చేసికోగల అంతరంగమూ లేదు. చదువు యింకా ఓనమాలే. ఏం చూసి నిన్ను నా భార్యవని చెప్పను ?! బాల్య వివాహాలు యింత నష్టాన్ని, బాధనీ అందించుతాయని యిపుడే తెలిసింది.

అందుకే అంటున్నాను అన్నపూర్ణా! నన్నిందుకు తప్పు పట్టవద్దు. సాహసించావని శపించవద్దు.

జీవితంలో ఆనందాన్ని అందుకోవడమే నా ధ్యేయం. ఆ ఆనందాన్ని నువ్వందించలేవు. విరిసీ విరియని పరిమళంలేని సుమానివి నువ్వు. లావిలేని పూవులెందుకూ ? అందమైనా లేని సుమాలతో ఎన్నాళ్ళు కలిసి వుండగలం? !




నిజమే! నాకు స్వయాన అక్కకూతురివే. కాదనను — కాని అంతకుమించి యిక ఏమీగావు నువ్వు. పెద్దవాళ్ళు కోర్టుకు తీసుకు వెళ్తారేమో నిన్ను! లాభం లేదని చెప్పు. ఏ శిక్షనైనా భరించగలను. కానీ నిన్నుమాత్రం భరించలేను. నీకూ నాకిక ఏ సంబంధమూ లేదు.'

ఆ జాబు చదవగానే నాలో ఆగ్రహం తారాజువ్వలా లేచింది. ఆమె వంక చూశాను. ఆ కళ్ళనిండుగా అశ్రుబిందువులే! ఏముదుగనింకా? పువ్వులాంటి ఆమె నేమని ప్రశ్నించను?

ఇంత మోసాన్ని ఎలా క్షమించావని అడగనా? ఎవరికీ ఎదురు చెప్పలేనంటున్నాయా చూపులు. ఇంత హాలాహలాన్ని ఎక్కడ దాచుకుందో?' ఎలా భరించిందో! మనిషిగాదూ? కోపం లేదా?

'మీరొక్కరే వచ్చారా!' అన్నాను. లేదన్నట్లు తలవూపింది. ఆ మమతామయి మాట్లాడలేదని తెలుసు.

'హోటల్లో వున్నాం! అవసరమైతే ఫోను చేయండి. ఈ అక్కయ్యకు అన్యాయం చేయరనే అనుకుంటున్నాను' అంటూ లేచి నిల్చుంది. కన్నీటి నాపుకోవడానికెంతో ప్రయత్నించుతోంది.

ఏదో అనబోయాను. అప్పటికే గేటు దాటి రోడ్డుమీదికి వెళ్ళిపోయింది. కారు బ్రురున్న చప్పుడయ్యింది. వెళ్ళిపోయిందామె, నాలో మహాసంగ్రామాన్ని సృజించి.

ఫోటోవంకే చూస్తూండగా వచ్చారాయన. వెంటనే లేచి వెళ్ళి పడుకున్నాను. ఎప్పటిలా నవ్వుతూ ఆహ్వానించలేక పోయాను.

'సారీ! కరుణా! ఆలస్యమైపోయింది. పిక్చరింకా మొదలై వుండదు. పద! వూ! త్వరగా!' అన్నారు. ఆరోజున సినిమాకు వెళ్ళాలనుకున్నాము. నాకొక్క అడుగుకూడా కదలాలన్పించలేదు.

'అరే! కోపం వచ్చిందనుకుంటానే దేవిగారికి! ప్లీజ్ ఎక్స్‌క్యూజ్‌మి కరుణా! వాళ్ళంతా ఓ ఆట వేసుకుందాం అని వదలలేదు పద! లే! వూ! క్విక్!'

'నేనురాను రాలేను' అన్నాను.

'ఏం? ఎందుకనో?'

'అంత అర్హత లేదు నాకు'

'అర్హత! ఇదేమిటి? మరెవరి

FDS NSF/369 TE







# ఉగాది శుభాకాంక్షలు!

మా ఖాతాదారులకు ఈ ఉగాది పండుగ
అధికలాభాలు చేకూర్చుటకు మేము
ఆశిస్తున్నాము. అధిక పాలవృద్ధికి పాడి ఆవులకు,
గేదెలకు (NSF) పశువుల మేతను, గంపెడు
కోడిగ్రుడ్లకు (NSF) కోళ్ళ మేతను ఉపయోగించండి.




తయారుచేయువారు:
ది నిజాం షుగర్ ఫ్యాక్టరీ లిమిటెడ్,
హైదరాబాద్-4 (A.P.)

బ్రాంచి: ఏలూరు రోడ్, విజయవాడ.

లభించు స్థలములు:

1. వెంకటరమణ ఏజెన్సీస్,
   పొట్టిస్వామి స్ట్రీట్, విజయవాడ—1.
2. అప్పలస్వామి & బ్రదర్స్.,
   కె. పి. టెంపిల్ స్ట్రీట్, గుంటూరు—3.
3. పులగం సతిరెడ్డి & కో.,
   తాడేపల్లిగూడెం, పశ్చిమ గోదావరి డిస్ట్రిక్టు.
4. పినస్ ఏజెన్సీస్,
   15—248, బృందావనమ్, నెల్లూరు—1.
5. శ్రీ శ్రీనివాస ఎంటర్ప్రైసస్,
   డా. స్వామినాయుడు స్ట్రీట్, రాజమండ్రి.
6. హాజి గఫార్ అహ్మద్,
   నెహ్రూ గంజ్, మహబూబ్‌నగర్.
7. సూర్యాపేట్ కో-ఆప్. మార్కెటింగ్ సొసైటి,
   సూర్యాపేట్, నల్గొండ డిస్ట్రిక్టు.
8. జి. వి. వరదరాజు,
   27—4—10/5, పూర్ణా బిల్డింగ్సు,
   వైజాగ్—2.
9. పి. తిరుపతిరావు,
   అగ్రికల్చరిస్టు & ఎక్స్ప్రెస్ కంట్రాక్టర్
   బెల్లంపల్లి. అదిలాబాద్ డిస్ట్రిక్టు.
10. ఇ. జగన్నాధరావు,
    5/556/1 కిషెన్‌పూర, హనుమకొండ,
    వరంగల్ డిస్ట్రిక్టు.
11. హైదరాబాద్ పౌల్ట్రి సెంటర్,
    రైల్వేస్టేషన్‌సమీపం, నాంపల్లి, హైదరాబద్.
12. కానుల బ్రదర్సు.,
    పప్పుల బజార్, కర్నూలు.
13. వైజాగ్ డైరీ ప్రోడక్ట్స్.
    కాల్‌గాస్ ఆఫీసు, శ్రీకాకుళం.
14. కంచెర్ల ఎల్లారావు & సన్,
    విజయనగరం.
15. లక్ష్మి ఎలెక్ట్రిక్ కార్పొరేషన్,
    అనకాపల్లి, వైజాగ్ డిస్ట్రిక్టు.
16. పద్మా లక్ష్మయ్య,
    వరంగల్.

మరియు ముఖ్యమైన డిస్ట్రిక్టు మార్కెటింగు సెంటర్లయందు కూడ లభించును

# ఇది న్యాయం

కుందంటావ్?'

'అన్నపూర్ణ అక్కయ్యకు'

'ఆవిడెవరు?!'

'డాక్టర్ భాస్కరంగారి చదువు రాని అందంలేని భార్య.' ఉలిక్కిపడ్డా రాయన విచిత్రంగా చూశారు నావంక.

'వచ్చిందా యిక్కడకి?'

'ఏం? రాగూడదా?'

'ఎందుకు వచ్చిందో?'

'న్యాయంకోసం వచ్చిందట.'

'అలాగా! సిగ్గులేకపోతే సరి! ఎలా వచ్చిందసలు?'

'మహారాణిలా వచ్చింది. సిగ్గు! అక్కయ్యకెందుకు సిగ్గు. ఏ నేరమూ చేయనివాళ్లెందుకు సిగ్గుపడాలి! వో నేరస్థుణ్ణి క్షమించిందిన్నాళ్లూ! అందమూ, చదువూ కావు ఆనందానికి కొలబద్దలు. మల్లెలాంటి మనస్సు ప్రధానం.'

'ఇదంతా ఆ మహారాణిగారి వుపన్యాసమేనా? ఇంత తెలివెలా వచ్చిందో? అయినా యిప్పుడెందుకా గొడవ? నాకూ తనకీ ఏ సంబంధమూ లేదని ఏనాడో చెప్పానుగా?' విసుగ్గా అన్నారాయన.

'అంతేనా?'

'అంతే!' మొండిగా వుంది జవాబు.

'అయితే యింక కరుణకూ, మీకూ ఏ సంబంధమూ లేదిక.'

'ఇదేమిటి? నీకెందుకింత కోపం?'

'కోపం! అంతటితో వూరుకున్నందుకే సిగ్గుగా వుంది నాకు. అన్నపూర్ణ ఎవరు? అక్కయ్యే గాదు! సాటి స్త్రీ కూడా. న్యాయాన్యాయాలు అందరికీ ఒకే విధంగా వుంటాయి. ఉండాలి. ఈనాడు అన్నపూర్ణ గతి అలా అయ్యింది. రేపు నాది కాదని ఎలా అనగలను? మరో అక్కయ్య, మరో చెల్లెలు యిలా బలిగారని నమ్మకమేది? ఎంతమంది భాస్కరాలున్నారో? వాళ్లందర్నీ ఏం చేయగలదీ లోకం? ఆనందం అందింది నాకు. చాలు అనుకోలేను. న్యాయంకోసం వాదించగలిగే నోరు మూసుకోలేను. అన్యాయాన్ని సహించలేను.'

'ఏం చేస్తావేమిటి? కోర్టుకువెళ్తావా?' పరిహాసం ధ్వనించిందా స్వరం నిండుగ.

'చట్టం మనిషిని మార్చలేదు. మనస్సుని జయించలేదు. మార్పును తీసుకుని రాలేదు. అందుకో వింతైన విప్లవం రావాలి. అన్యాయాన్ని ఏ పరిస్థితుల్లోనూ సహించగూడదు. సమర్థించగూడదు. అన్నపూర్ణ అక్కయ్యల్ని పైకి తీసుకురావాలి.'

'ఉపన్యాసం బావుంది.'

'ముల్లువిరిగిన వాళ్లకి బాధ తెలుస్తుంది. ఒక్కటే మాట. అన్నపూర్ణ అక్కయ్య వచ్చేవరకూ నేనూ రాను యింటికి.'

'అదిమాత్రం కలలో కూడా జరగదు.'

'అయితే కరుణకూడా కలలోకైనా రాదు'

'బెదిరించుతున్నావా?'

'కాదు న్యాయంకోసం వాదించుతున్నాను.'

'ఇది కోర్టుగాదు.'

'ప్రతిమనిషి మనస్సూ ఒక కోర్టే. న్యాయానికి ప్రతిమనిషి ఏదో ఒక క్షణాన తలవంచ వలసిందే!'

'ఈ నిర్వచనాలన్నీ నా కనవసరం! అన్నపూర్ణ యిక్కడికిరాదు. రాదు.'

'ఎందుకని రాదు? ఏం తప్పు చేసిందని రానీయరు?'

'అంత వాసనలేని పువ్వునే మనిషి భరించలేడు! అందం ఆనందాన్ని సృష్టించుతుంది.'

'ఒక చిన్నసందేహం? మీరు విదేశాల్లో కూడా చదివారు. ఆనందం ఎక్కడుంటుంది.'

'మనస్సులో!'

'మనస్సు అందమైనదైతే మనిషి కానపుడు వచ్చిన నష్టమేమిటి?' అన్నాను.

'చదువుకూడా లేదు అన్నపూర్ణకు!'

'అదొక నేరమా? లేక పాపమా?' ఆయన మాట్లాడలేదు. బహుశః ఆలోచనలో పడ్డారేమో!

'నీకు తెలియదు కరుణా! అంత అమాయకత్వాన్ని నేను భరించలేను, అంత కురూపిని చూస్తూ నవ్వలేను.'

'క్షమించండి! మీ మాటలు కడుపు నవ్వుతెప్పిస్తున్నందుకు. మీరు డాక్టరేగా! వ్యాధిని భరించ లేరేమిరా! ఆ భరించరానిదాన్ని

రూమ్మలించి ఆరోగ్యాన్ని అందించు తున్నారు. అందుకు కొన్నిసార్లు చేదు మందుల్ని యిస్తున్నారు. మందు చేదే! కానీ అదే ఆరోగ్యాన్నిస్తుంది. ఏమంటారు?'

'నీమాట కాదనలేను కరుణా! కానీ ప్రతిమనిషీ ఒక బలహీనతకి లొంగిపోతాడు. నేను డాక్టర్నే కావచ్చు కానీ అన్నపూర్ణని మాత్రం ఆహ్వానించ లేను.'

'మరి అక్కయ్య ఏమై పోవాలి? బలహీనత ప్రతివాళ్ళలోనూ వుంటుంది. కాదనను. కానీ ఆ బలహీనత మరో మనిషి జీవితాన్ని బలి తీసుకోవచ్చా? చదువూ, సంస్కృతీ వున్న వాళ్ళే యిలా చేస్తే, అజ్ఞానం లేనివాళ్ళేం చేయాలిక?'

'నీతో వాదించలేను కరుణా!'

'అందం లేదు సరే! అక్కయ్యకు చదువు మీరు నేర్పుకోలేరా? ఇంతమందికి ఎంతో ఓర్పుగా వైద్యం చేస్తున్న మీకు భార్యకు చదువు నేర్పుకోడానికి ఓపిక లేదా? లేక అభిమానం అడ్డు వస్తుందా?'

'నాకంత గతి పట్టదెపుడూ! అయినా నాకెందుకంత కష్టం?' తిరిగీ అభిమానం తలెత్తిందాయనలో.

'మరి అక్కయ్య కెందుకా గతీ, కష్టమూ? ఏం పాపం చేసింది?'

'వెళ్ళు ఆవిడనడుగు! నేను వెళుతున్నాను.'

'ఆగండి! నేనొక్కదాన్నే వెళ్ళను. మీరూ రావాలి!'

'రాను.'

'రావలసిందే?'

'రానని చెప్పాను.'

'మరో నేరాన్ని ఆహ్వానించుతారా అయితే!'

'నేరం!!'

'ఆ! నేరమే! మీరు రాత్రి తెచ్చిన నిద్ర మాత్రలు అల మారులోనే వున్నాయి. పది వేసుకుంటాను. కరుణాదేవి ఆత్మహత్య చేసుకున్నదని మీరే వ్రాసి యివ్వాల్సి వస్తుందపుడు. అలా చేయమంటారా?'

'కరుణా!!...' అంతకు మించి మాట్లాడలేక పోయారాయన.

'అవును. కరుణనే నేను. అక్కయ్యను వెంటబెట్టుకు వద్దాం పదండి. చదువు నేను నేర్పుతాను. మాట్లాడగల నేర్పు చెబుతాను. మీకు నచ్చేవిధంగా తయారు చేస్తాను. పదండి! దయచేసి అడ్డు చెప్పవద్దిక. అక్కయ్య మనసు మల్లెపువ్వు. ఆ మల్లెవాడి పోడానికి వీల్లేదు. అక్క మనస్సు ఘోషించుతోంటే, చెల్లెలికి నిద్ర పట్టదు. సుఖం జీర్ణించదు!' అన్నాను. నాది త్యాగమని నేననుకోను. న్యాయాన్ని త్యాగమెలా అంటారు?

'మీ నాన్నగారేమంటా...'

'నాన్నగారేగాదు! ఆ దేవుడైనా ఏమీ అనడు. అనలేడు. ఎలా అనగలరసలు? అక్కయ్యే మిమ్మల్ని నాకు దానం చేసింది. న్యాయంగా మీరామె సొమ్ము. మధ్యన నేనెవర్ని యివ్వనని అనడానికి? అక్కయ్య, ఈ చెల్లెల్ని కాదనలేదు. నా సుఖ సంతోషాల్ని చూసి ఓర్వలేనంత అసూయ లేదా మనస్సులో.'

'కరుణా! నువ్వు...దేవతవు!'

'అనవసరంగా పొగడకండి. నిజాన్ని అంగీకరించగానే దేవతలమై పోము.పదండి. ఇప్పటికే ఎంతో ప్రొద్దుపోయింది' అన్నాను.

కారు దిగగానే నేనే ముందు వెళ్ళి అక్కయ్యను పిలిచాను. ప్రక్కన ఆయన్ని చూసి నిర్ఘాంతపోయింది. బొమ్మలా నిల్చుండిపోయింది.

'మీ భాస్కరం బావగారూ, కరుణ చెల్లాయి వచ్చారు. లోనికి రమ్మంటావా అక్కా?' అన్నాను.

నాకు తెలుసు. ఆయన్ని చూసి తనను తాను మరిచిపోయింది. ఈ దేవతనా నేను మోసం చేసిందని అనుకుంటున్నారేమో ఆయన. కళ్ళల్లో నీళ్ళు తిరుగు తున్నాయి.

'బావా!' కన్నీరాగటం లేదు అక్కయ్యకు.

'ఛా! ఏడవకు? అక్కా! ఆయన నీవారు. ఎవ్వరూ లాక్కుపోలేరిక. నాకే యింత చోటివ్వండి మీరు!' అన్నాను.

'ఆ! నీకా! చెల్లాయ్! నేను చోటివ్వాలా!'

'అమ్మా! కరుణ తల్లీ! నూరేళ్ళూ వర్థిల్లు! నా బిడ్డ కాపురం నిలబెట్టావు. కరుణవే తల్లీ నువ్వు నిజంగా!' అన్నారు అక్కయ్య నాన్నారు కన్నీరు తుడుచుకుంటూ.

'అక్కా! పద యిక! మనయింటికి వెళ్దాం!' అంటూ తీసుకునివెళ్ళి కారులో కూర్చోబెట్టాను ఆయన ప్రక్కనే. మరో వైపున నేను కూర్చున్నాను. అక్కయ్య కన్నులనిండుగా ఆనందమే! కారు జీవన రథంలా కదిలింది. నాన్నగారితో చెప్పాను జరిగినదంతా. ప్రశంసాపూర్ణ దృష్టులతో చూస్తూ అన్నారాయన—

'కరుణా! మమత విలువ తెలిసిన మనిషి వన్పించుకున్నావమ్మా!' అని.

'నిజమే! నాన్నారు అన్నమాట. నేను మనిషినే! అన్పించింది. మనిషిలా వుండాలనే ఆ కరుణావిభుని అనుక్షణం ప్రార్థిస్తున్నాను. అంతేగాదు ఇది న్యాయం అన్నాను నాన్నగారితో.

[అంకితం:— అన్నపూర్ణ వంటి అక్కయ్యలకీ, చెల్లెళ్ళకూ మనఃపూర్తిగా అందించుతున్నాను — ఇది సానుభూతిగాదు. కాగూడదు. మేలుకొలుపు కావాలనే నా ఆకాంక్ష—రచయిత్రి]



కె. రామలక్ష్మి



# మూగ మాటలు

'సాంసారిక జీవితంలో పడిపోయాక భార్యాభర్తల మధ్య మాట్లాడుకుందు కేముంటాయి? ఉండాలా?' అంటూ పది సంవత్సరాలు జీవితయాత్ర భర్తతో పాటు సాగించిన ఇద్దరు స్నేహితులు మాట్లాడుకొంటున్నారు. వాళ్ళో జబ్బుంది. ఏ బస్సులోనో, రైల్లోనో తమవారెవరూ లేరన్న ధీమాతో రక రకాల ఇబ్బాతి బాధలు తీవ్రంగ స్వేచ్ఛగా యిద్దరాడువారు కూర్చుని చర్చించేస్తూంటే వారి దైలాగు మెంటల్ షార్టుహాండు తీసుకోవడం!

ఒకామె.: నే నేదైతే జరుగుతుందని బెంగపడేదాన్నో అదే జరిగింది. మానసికంగా నేనో జడపదార్థాన్ని కబోలు! మా వారికి నేనే ఒక పెద్ద బోర్. నేనేదైనా మాట్లాడ్డం ప్రారంభిస్తానా? సగం విసీ విననట్టుంటారు. లేకుంటే పక్కనున్న పేపరు తీసుకుంటారు చదవడానికి ... నాపాటికి నేను మాట్లాడుకుంటూ ఉండడమే ...

**రెండో ఆవిడ :** దాల్లో పెద్ద వింతేముంది? నేనందు కసలు మాట్లాడ్డం మానుకున్నాను. ఆయన గదు హాల్లో కుర్చీలో చేరబడగానే నేను వంటింట్లోకో పక్క గదిలోకో పోతాను.

ఒకటో ఆమె : పెళ్ళయిన కొత్తలో మేం తెగ మాట్లాడుకునే వాళ్ళం. కాని ఇప్పుడో. ఇద్దరం ఒకేచోట కూర్చుని— గంటల తరబడి కూర్చుండిపోతాం. అదే నాకు బెంగగా ఉంటుంది. అప్పుడే ఆ సాన్నిహిత్యం, స్నేహ భావం సమసిపోతే యింక జీవితం ఎలా సాగుతుంది.

ఇంకా నా పార్శ్వ సాండు పూర్తి కాకుండా అన్యాయంగా బస్సు దిగిపోయారు వారిద్దరూ. నాకు సగం సినిమా చూసి సొమ్మసిల్లినంత అసంతృప్తి కల్గింది.

అవును. భార్యా భర్తలకి మాట్లాడుకుందు కేముంటుంది? అని ప్రశ్నించుకున్నాను. ఎందుకుండదూ? అని ప్రశ్నించుకున్నాను. మాట్లాడుకోకుండా ఉన్నంత మాత్రాన స్నేహం సాన్నిహిత్యం పోయాయని ఎందుకు అనుకోవాలి? ... మొదటావిడ ఒక సంగతి మరిచిపోతోంది అనిపించింది. ఈ స్నేహ సాన్నిహిత్యాల తత్వంలో కాలం పోను పోను మార్పు వస్తుంది. ఆఫీసునుంచి యింట్లోకి అడుగు పెట్టగానే సినిమా హీరోలాగా 'హై' అంటూ నవలల్లోలాగా 'ఏయ్ కమల్, త్వరగా తెములు సినిమాకి వెడదాం' అంటూ కేక వేయడమనేమో!! ఇంటికి వస్తూనే నవ్వుతూ తుళ్ళుతూ కబుర్లకి దిగరనేమో!...

ఆఫీసుకిగాని పనికిగాని వెళ్ళివచ్చిన ఆడదానికైనా మగవాడికైనా ముందు కొంచెం విశ్రాంతి కావాలి ... తరవాత మెల్లిగా కబుర్లలోకి వాళ్ళే దిగుతారు... చెప్పవలసి నంతటి ఘనకార్యాలు జరిగి ఉంటే ... ఇదెప్పుడు జరుగుతుంది? ... ఇద్దరి కిద్దరూ అరమరికలు లేకుండా మనసువిప్పి మాట్లాడుకునే తత్వం కల వారైతేను. అప్పుడే, కబుర్లు చెప్పే వోపికా కబుర్లువినే వోర్పూ ఉంటాయి. భిన్నాభిప్రాయాలున్నా విని తన అభిప్రాయాన్ని చెప్పే నిజాయితీ ఉంటుంది. ఇంతే కాదు వీటన్నిటికీ మధ్య 'మాటల్లేని మాటలు' ఎప్పుడూ ఉంటూనేఉంటాయి. ఇవి ఇద్దరు ప్రేమికులమధ్య మూగ సంభాషణలు. ఒకరి నొకరు బాగా అర్థం చేసుకున్న దంపతులు ఎప్పుడూ ప్రేమికులే కదా? వారిమధ్య ఇబ్బా మాటల లేమి ఎదుటివారి కెలా కన్పించినా అవే వారి స్నేహ సాన్నిహిత్యాలకి గీటురాళ్ళు. వారిమధ్య ఏ మాత్రమైన భేదాభిప్రాయాలూ పొరపొచ్చాలూ ఉండకపోవచ్చు. బస్సు ప్రసందుగురించి అత్తయ్యకి చెప్తే నవ్వుతూ మామయ్యకేసి చూసిందత్తయ్య. ఒక్కమాట మాట్లాడక పోయినా వారిద్దరూ ఒకటని గ్రహించ కలిగాను నేను. అత్తయ్య ఎప్పుడూ తానో జడపదార్థం అనుకోదు. ●



గొలుసునవల



# అపరాజిత

నలుగురు రచయిత్రుల సంయుక్తరచన

రెండవభాగం:

తురగా జానకీరాణి

### జరిగిన కథ

రాధాకృష్ణ పోయేసరికి పార్వతి గర్భవతి. ఆమె తప్పనిసరిగా రుక్మిణిని ఆశ్రయించవలసి వస్తుంది. బిడ్డని కని పార్వతి కూడా కన్ను మూసింది. ఆ పిల్ల మాధవి. రుక్మిణి దగ్గర మాధవి పడరానిపాట్లు పడ్డది. కళ్లారా చూసిన పరమేశ్వరి మాధవిని తనతో తీసుకు వెళ్ళిపోయింది. శ్యామల రాధలతోపాటు మాధవిని కూడా కన్నకూతురిలాగే పెంచింది. మాధవి ఉద్యోగం చేస్తూ వచ్చిన జీతాన్ని శివశాస్త్రికి ఇవ్వడం ద్వారా అతని అభిమానానికి కొంత పాత్రురాలు కాగల్గింది. మధు ఆ యింట్లో కొత్తగా అద్దెకు వచ్చాడు. రాధ అతనితో పరిచయం పెంచుకుంది. రాధ ఆరాధన మనసులోనే వుండిపోయింది. మాధవి అతనికి బాగా సన్నిహితురాలైంది. మధుకి కూడా ఆమెపై అంతులేని అనురాగం. రాజారావుకి శ్యామలకి పెళ్ళయింది. బిడ్డని కని శ్యామల కళ్ళు మూస్తుంది.

## 6

'శకుంతల ఏడుస్తోంది, పాలుపట్టాలి. కొంచెం అన్నం వార్చేసి వస్తావా?' అన్నది పరమేశ్వరి మాధవితో.

ఇంకా కరెక్టు చేయవలసిన పేపర్లున్నాయి. తెల్లవారి యిచ్చేయాలి. బొత్తిగా టైము ఉండటం లేదు. జడవేసుకోడానికి, అన్నం తినడానికికూడా టైము వేస్టవుతుందని భయం వేస్తోంది. పోనీ సెలవు పెడదామన్నా వీలులేదు. శ్యామలకి జబ్బు చేసినప్పుడు, ఆమె పోయినప్పుడు వున్న లీవు అంతా వాడేసుకుంది. మాధవి ప్రక్కకి తిరిగి చూసింది. మంచంమీద కాళ్ళు చాపుకుని కూర్చుని రాధ పత్రిక చదువుకుంటోంది. నెలరోజులే వున్నాయి సెప్టెంబరు పరీక్షలు. పుస్తకాల కోసమని ఫ్రెండుయింటికి వెళ్ళి, వాటితోపాటు పత్రికలూ తెచ్చుకుని చదువుకుంటోంది.

రిజిష్టరు మూసివేసి లేచింది మాధవి. వెళ్ళి అన్నం వార్చింది, పెద్దనాన్న వుంటే తనీపని చేయడానికి వీలుకాదు. ఆయనకి మడి. రాజారావు వాళ్ళవూరికి వెళ్ళాడాయన. పెద్దమ్మకి రాత్రిపూట అంత పట్టింపులేదు.

తిరిగివచ్చి కూర్చున్నాక రాధవంక చూసింది. ఇదివరకు దానివైఖరి అంత కష్టంగా అనిపించేది కాదుకాని ఈమధ్య చాలా కష్టమనిపిస్తోంది మాధవికి. 'రాధా పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. చదువుకోరాదుటే!' అన్నది చివరికి పట్టలేక.

'ఊఁ!' అని పలికిందేగానీ ఆమె కదలలేదు. ఆ మంచంమీదే ఒకమూల శకుంతల నోట్లో వ్రేళ్ళు పెట్టుకుని పడుకునుంది. దీపాన్ని చూస్తే కాళ్ళు ఎగరేస్తోంది. నొక్కుల జుట్టు, నల్లని కళ్ళు మాత్రం శ్యామల పోలిక. రంగు, ముక్కు మాత్రం రాజారావువి. అందుకే అంత చక్కదనాలు చిమ్ముతుంది.

మళ్ళీ రికార్డు తెరిచి కూర్చోకుండా లేచివెళ్ళి, శకుంతలమీదకు వంగి పలుకరిస్తూ, కబుర్లు చెప్పడం మొదలెట్టింది మాధవి, ఏమిటో లోతుగా వుంటుంది పాపాయిచూపు. అవతలివారి మనస్సులో ఏమి ఆలోచనలు మెదులుతున్నాయోనన్న సంశయాలు, జవాబులు ఏమి చెప్పాలన్న భయాలు లేక నవ్వేకళ్ళు అవి.

పెద్దమ్మ పాలుపట్టి, సీసా ప్రక్కనే పడేసింది. 'అన్నీ త్రాగలేదే, ఏమొచ్చిందో! ఒక్కనిముషమాగి పట్టిచూడు.' అన్నది మాధవితో. ఆమె వెళ్ళి వంటింట్లో మజ్జిగ చిలుకుతోంది. పాపాయిని పలుకరిస్తూ కూర్చుంది మాధవి. రాధ ఎప్పటికీ విడిచిపెట్టదు ఆ కథల పత్రికని. క్రిందటివారం ఒకసారి తను చదువుకోమని హెచ్చరిస్తే, 'పరీక్ష ఫీజులన్నీ తనే కడుతున్నా కదా, దండగైపోతాయని సాధిస్తుంది.' అన్నది పెద్దమ్మతో. మాధవికి మనస్సు కలుక్కుమంది. డబ్బిచ్చాకదా అని మాటలు అంటుంది అని గబుక్కున నోరు జారుతుంది రాధ. ఎంత తేలిగ్గా అపార్థాలు చేసుకుంటారు మనుష్యులు! దానిమంచి దానికే అర్థం కావడంలేదు.

ఏ విధంగానూ తనని అపార్థం చేసుకోని వాడు మధు ఒక్కడే కనబడుతున్నాడు. శ్యామల పోవడంతో సంసారమంతా అల్లకల్లోలమైంది. అందరూ కృంగిపోయారు. అతనూ, తనూ ఏమీ మాట్లాడుకొనే లేదు. కథంతా మొదటికి వచ్చినట్లైంది యిద్దరికీ. కళ్ళెత్తి చూసుకోలేదు ఒకరినొకరు ఎన్నాళ్ళో. శ్యామలపోయి రెండునెలలు దాటింది. పాపకి మూడోనెల వచ్చింది. భూమిమీద

ఏడుతూనే తల్లిని పొట్ట పెట్టుకున్న ఆజీవి అందరికీ సమస్య అయింది. చంటి పిల్లని ఎత్తుకుని ఎన్నేళ్ళయిందో పరమేశ్వరికి. పాలఖర్చుకి కలవరపడుతున్నాడు శివశాస్త్రి — తను భరించేది ఏమంత లేకపోయినా. రాధకి ఒక్కోసారి విసుగు దాని ఏడుపు వింటే. అక్క శ్యామలని, అర్థాయుషుతో వెళ్ళిపోయిన ఆమె అభాగ్య జీవితాన్ని అనుక్షణం మాధవికి గుర్తు తెస్తూంటుంది శకుంతల.

రాజారావు పిల్లని తీసుకు వెడతానని అనలేదు, 'మీరు చూస్తోండండి' అనలేదు. ఏదో వస్తువుని మర్చిపోయి వదిలినట్లు విడిచి వెళ్ళిపోయాడు. వెళ్ళాక కూడా ఏమీ కబురులేదు, జాబులేదు.

ఆ రోజు తను కాలేజీ నుంచి వచ్చే సరికి అతను సామాను రిక్షాలో పెట్టుకుంటున్నాడు. గుండెలో వున్న బరువు ముఖంలో, కళ్ళల్లో స్పష్టంగా కనబడుతోంది. మాధవి లోపలికి వచ్చి సామానుకేసి చూస్తూ నిలబడిందే కానీ ఏమీ అనలేదు. అతను అరుగు మీద కూర్చున్న మామగారితో మాత్రం చెప్పి వెళ్ళిపోయాడు.

బాగా చీకటి పడ్డాక వీధిలోకి చూస్తూ మాధవి నిలబడి వున్నప్పుడు, మధు వచ్చి తన గది తాళం తీసుకున్నాడు.

'నిలబడ్డావేం మాధవీ!' అన్నాడు.

'ఏమీలేదు, వూరికేనే. మీకింత ఆలస్యం అయిందేం?'

'ఆలస్యం అయింది.' అన్నాడతను జవాబుగ.

తనకి తెలుసు అతను ఓవర్‌టైము చేస్తున్నాడు డబ్బుకోసమని. ఆ చీకట్లో వచ్చి దుమ్ముకొట్టుకు పోయిన గదిలో ఏం చేస్తాడతను? తను కూడా లోపలికి వెళ్ళి దీపం వేసి అవీ యివీ సర్దుదామని మనస్సులో వచ్చిన కోరికని అణిచేసుకుని వెనక్కి తిరిగి లోపలికి వచ్చేసింది మాధవి. 'మీ బావగారు వెళ్ళారా? పిల్లని తీసుకెళ్ళలేదేం?' అని ఆనాడు అడగలేదు. గ్రహించుకున్నాడేమో మరి! మాధవి మీద పడిన భారం ఎంతదో అర్థంచేసికున్నాడేమోమరి ఊరుకున్నాడు.

* * *



శివశాస్త్రి తిరిగి వచ్చాడు. అక్కడ ఏమి జరిగిందో, రాజారావు ఏమన్నాడో గబగబా చెప్పే స్వభావం కాదాయనది. కోపమొస్తే మాట మిగులుతాడు కాని మిగతా సమయాల్లో మూభావమే. ఆయన వచ్చిన రోజు రాత్రి పెద్దమ్మ వంటింట్లోకి పిలిచింది మాధవిని పనుంది రమ్మని. కుంపటి మీద పాప పాల కోసం నీళ్లు పెట్టి విసురుతో ఆమె కూర్చున్న తీరు చూడగానే మాధవికి తట్టింది ఆమె తనతో ఏదో సీరియస్‌గా చెబుతుందని. పెద్దనాన్న యింట్లో లేదు.

'మాధవీ, మీ బావ ఏమన్నాడో విన్నావా? పిల్లని తను తీసుకెళ్లడుట— అల్లా కూర్చో పీట లాక్కుని. చాలా వున్నాయి చెప్పాల్సినవి.' అన్నది పరమేశ్వరి.

'ఈ పసిగుడ్డు ఎప్పటికి పెరిగి పెద్దదవుతుంది, దీని ఖర్చంతా ఎవరు భరించవని మీ పెద్దనాన్న బెంగ. తల్లిలేని పిల్ల అదొక్కత్తి బరువాండీ అంటే ఆయన వినిపించుకోక, అల్లుణ్ణి అడగడానికి వెళ్లారు ఏం చేయమంటావు పిల్లనని.'

'ఏమన్నాడుట?' మాధవి తలవంచుకుని అడిగింది.

'పిల్లని ఎవరు చూస్తారిక్కడ, ఎవరూ ఆడదిక్కు లేదు అన్నాడుట.'

'నిజమే.' అన్నది మాధవి. పరమేశ్వరి ఆమె వంక ఒక్కక్షణం చూసి, 'ఏమిటి నిజం? మతివుందా నీకు?' అన్నది.

# అపరాజిత

'ఏం?' అని తెల్లబోయి తలెత్తి చూసింది మాధవి.

'పిల్లని చూడ్డానికి నిన్ను పెళ్లి చేసుకుంటాడుట.'

ఎత్తిన తలని అల్లాగే వుంచింది మాధవి. ఒక్క క్షణం మనస్సులోని సుడులన్నిటినీ ఏకం చేసి పెద్దమ్మని చూసింది. మరుక్షణం తలదించుకుంది.

పరమేశ్వరి యింక ఏమీ అనక కుంపటి విసురుతూ కూర్చుంది. ఆమె చెప్పిన విషయం ముందు మాధవికి క్రొత్తగా వినబడినా ఎప్పుడో ఆమె మనస్సులో అనుమానంగా, భయంగా మెదిలినదే. కానీ యిప్పుడు బావ యిల్లా అడగడంతో సమస్యగా నెత్తిమీద పడింది. తను వూరుకుని లాభం లేదు.

'శ్యామల పెళ్లికి డబ్బు ఎవరిచ్చారని అడగలేనా బావ?' అన్నది మాధవి.

'అడగడం దేనికి? అతనికి తెలుసు. అసలు యిక్కణ్ణించి వెళ్లేటప్పుడే మీ పెద్దనాన్న ఆ మాట అనుకుని వెళ్లారు. తల్లి, తండ్రిలేని పిల్ల మాధవి, దానిని అన్యాయం చేయడానికి తలపెట్టొద్దని నేను మొత్తుకున్నాను. వెళ్లి అడిగి వట్టున్నారు మాధవిని చేసుకుంటావా అని. సరే నన్నాడు అతను. అల్లా చెప్పక, అతనే అడిగాడని నా దగ్గర అబద్ధాలాడుతున్నారు.' ఆక్కసుగా అన్నది పరమేశ్వరి ఈ మాటలు.

'నీ కిష్టంలేనా పెద్దమ్మా?' అన్నది మాధవి తలయెత్తి.

పరమేశ్వరి విసనకర్ర క్రిందపడేసి మాధవిమీద చేయి వేసింది. ఆమె కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. 'నాకు తెలియనా మాధవీ అన్ని సంగతులూ? నీకు నాలుగువేల రూపాయిలు ఎల్లా వచ్చాయో అందరికీ తెలుసు. అది అంత భారం ఎందుకు మీద వేసుకోవాలండీ అని దెబ్బలాడితే, చదువుకుని సంపాయిస్తోందిగా, అన్నారు పెద్దనాన్న. కష్టమో, సుఖమో అప్పు తీరుస్తున్నాకూడా ఆయన కేమైనా పట్టిందనుకున్నావా?' అని కొంచెం ఆగి— 'తీరిపోయిందా అంతా?' అన్నది చివరి ప్రశ్నగా.

'ఆ, పూర్తయింది. ఇంక నాకు ఏ బాధ్యతలూ లేవు—' అని వెంటనే 'ఉన్నాయి, యింకా తీర్చాలి' అని తలదించుకుని గుండె బరువైపోగా, గొంతు పూడుకుపోయి, ఉక్కిరి బిక్కిరైంది.

'ఎంత కష్టపడుతున్నావు తల్లీ? నేనుండీ ఏమీ చేయలేను' అని పరమేశ్వరి వాపోయింది.

వంటింట్లో మాటలు వినబడి లోపలికి వచ్చింది రాధ. దిగలుపడి కూర్చున్న యిద్దరినీ చూసి, వెనక్కి తిరిగి వెళ్లి ముందు గదిలో కూర్చుంది. ఉయ్యాల్లో పాపాయి కదిలి క్యారుమనేసరికి పైతల్లి, కూతురు యిద్దరు కదిలారు.

'మాధవిని ఆలోచించుకోనివ్వండి అని చెప్పాను మీ పెద్దనాన్నతో' అన్నది పరమేశ్వరి. ఇంకా నేను ఆలోచించి చెప్పుకుంటాననే వీళ్ల ఉద్దేశ్యమా అని మాధవి మనస్సులోనే బాధ పడింది.

* * *

రాత్రి పన్నెండుంబావయింది. చదివిన పుస్తకం మడిచి ప్రక్కకి తిరిగి పడుకున్నాడు మధు. వెలుగుతున్న దీపం వంక చూశాడు, చదువుతున్నంతసేపూ ఆ పుస్తకంలోని కథలో లీనమైపోయిన మనస్సుకి సమస్యలు లేవు. అది మూసేయగానే తనని కలవరపెట్టే ఆలోచనలు ఝుమ్మని ముసురుకొంటాయి.

నాన్నగారికి ఎల్లా తెలిసింది నాలుగు వేలు తను ఆఫీసులో అప్పు తీసుకున్నట్టు?







రోజు రోజుకూ
సుదర్శన్‌పై
నమ్మకం కలవారి
సంఖ్య
పెరుగుతున్నది
1969వ సంవత్సరంలో
18 కోట్ల రూపాయల
వ్యాపారం నిర్వహించబడింది అంటె
ఇది క్రితం సంవత్సరం కంటే నూటికి
22 వంతులు, అయిదేళ్ల క్రితం కంటే నూటికి
1700 వంతులు పెరుగుదల అన్నమాట
ఇండియాలోకెల్లా చిట్‌ఫండ్ సంస్థలలో అతి
పెద్దది అయిన సుదర్శన్‌పై
వెలాది కేంద్రాలలో ప్రజల నమ్మకం
పెరుగుతున్నదనడానికి తార్కాణం
వేరే వివరాలు
అడిగి తెలుసుకోండి




SUDARSAN CHIT FUNDS
SCF

వింత నిషాకారంగా, కోపంగా వ్రాశారో వుత్తరం? అసలు వద్దామనుకున్నారుట గానీ, వీల్లేక రాలేదని వ్రాశారు. వస్తే, తమన్న యీ గదీ, వాలకం చూపి అంతా గ్రహించేవారు.

పూర్తిగా ఒక ఏడాది జీవితంలో ఎన్నడూ లేనంత యిబ్బంది పడ్డాడు డబ్బుకోసం. అప్పుడు ఆ యిబ్బందులేమీ లెక్కపెట్టే పరిస్థితిలో లేడు; కానీ యిప్పుడు తలచుకుంటే తల గిర్రున తిరుగుతోంది.

తనింకా ఎందుకున్నాడు ఈ యింట్లో? ఏ సౌకర్యమూ సుఖమూ లేని ఈ గదిలో ఎందుకున్నాడు నిజంగా? నెల నెలా శివశాస్త్రి అద్దెకోసం ఎదురు చూస్తున్నప్పుడు తను వెళ్ళి, నేను మీ కేమీ యివ్వనక్కర్లేదు, మీరే నాకు నాలుగువేలు బాకీ అని ఎందుకు చెప్పేయలేదూ? ఆయనతో తనకేమీ సంబంధం లేదు కనుక చెప్పలేదు. అసలు సంబంధం వున్న మనిషే ముఖం తప్పించి తిరుగుతోంది.

మాధవి తనతో వచ్చేస్తే ఏ చిక్కూ వుండదు...

మధు లేచి కూర్చున్నాడు. తలుపు చిన్న చప్పుడైంది.

'ఎవరు?' అంటూ వెళ్ళి తెరిచాడు.

మాధవి లోపలికి వచ్చింది.

'ఏమిటి మాధవీ అర్ధరాత్రి వేళ? ఏమైంది?' అన్నాడతను.

# అపరాజిత

ఎన్నోచెప్పి, ఏదో సలహా అడగాలని వచ్చింది మాధవి. ఎప్పటికీ నిద్ర పట్టక, దారితోచక చివరికి తెగించి లేచివచ్చి తలుపు తట్టింది. కానీ అతను ఏమైందని అడగగానే చటుక్కున చెప్పలేక పోయింది. కొంచెం ఆగి, 'మీ గదిలో లైటు వెలుగుతోందని చూసి వచ్చాను. ఏం చేస్తున్నారు?' అన్నది.

'చదువుకుంటున్నాను. రా కూర్చో' అని కుర్చీలోని బట్టలుతీసి అవతల పడేశాడు. ఆమె కూర్చున్న కాస్సేపటికి 'ఏమైంది? తేలిందా — మనసంగతి— మన పెళ్ళిసంగతి?' అన్నాడు. అన్నిటి కంటే పైగా వున్న ప్రశ్న, ఆశ, జీవితంలోని ఏకైక కోరిక బయటికొచ్చింది మధుకి.

మాధవి తలవంచుకుంది. 'అది మాట్లాడాలనే వచ్చాను.' అన్నది ఏమిటి చెప్పాలతనికి, ఎల్లా చెప్పాలి? కోపగించుకుంటాడేమో, బాధపడతాడేమో, ఆవేశంతో ఏమైపోతాడు—కానీ తప్పదు.

'మా శ్యామలక్కయ్యే చచ్చిపోయినప్పుడు పిల్లని నాకు వప్పగించింది.'

'ఔను, చెప్పావు, రాజారావు యిప్పుడు తీసుకెళ్ళనంటున్నాడా? నిన్నే చూడమంటున్నాడా?' ఇతను ఎప్పుడూ యింతే, బావ పేరువస్తే మాటలు అనేస్తాడు.

'అనలేదు. కానీ, నాకు దిక్కు మీరొక్కరేనని సలహా అడుగుతున్నాను. చెప్పండి ఏంచేయమంటారో!'

'ఏ విషయం మాధవీ! పిల్లని చూడటం విషయమా? ఎల్లా చూస్తావు నువ్వు! ఐనా నీకు ఏమిటి సంబంధం?'

'ప్రాణం పోయేముందు నాతోనే చెప్పింది కదండీ?'

'అదేమిటి — ఆవేశంలోవున్న మనిషి ఏదో ఒకటి అంటుంది.' అన్నాడతను.

ఇల్లా అంటోంటే అతని భావం అర్ధంకాలేదు మాధవికి.

తను చేసిన వాగ్దానానికి ఏమీ విలువ లేదని అంటారేమిటి? అల్లాగైతే దేనికీ అర్ధంలేదు. కానీ — ఏవో ప్రశ్నలతో, అడ్డమాటలతో మధునే దూరం చేసుకోరాదు తను.

'నిన్న మా పెద్దనాన్న బావ దగ్గరికి వెళ్ళి వచ్చారు. అతను ఒకమాట అడిగాడుట. పిల్లని తీసుకు వెళ్ళాలంటే పెళ్ళి చేసుకోవాలన్నాడుట.' అన్నది తలవంచుకుని.

'లక్షణంగా తనెవరి నెత్తినో చేయి పెట్టి' మరో నాలుగువేలు గుంజి పెళ్ళి చేసుకుని, పిల్లని తీసుకు వెళ్ళమని చెప్పలేదా శివశాస్త్రిగారు? అల్లాంటి మాటలు ఆయన బాగానే చెబుతాడే?'

ఆమె తల యెత్తింది. 'ఎందుకండీ అంత కటువుగా మాట్లాడుతారు? అసలు అవన్నీ కాదు నాకు వచ్చిన పెద్ద సమస్య— బావకి మనస్సులో వేరే ఉద్దేశ్యం వుంది —నన్ను గురించి.' అని మళ్ళీ తల వంచేసింది ఆమె.

మధు కొంతసేపు నిశ్చలంగా చూశాడు. 'అంటే అతన్ని పెళ్ళిచేసుకోమని బలవంతపెట్టడం సంగతే!' అన్నాడు తీవ్రంగా.

'లేదు. బలవంత పెట్టడం కాదు. మీరు కూడా నాతో యిల్లా మాట్లాడితే నేను ఏమైపోవాలి?' అని వచ్చే ఏడుపుని ఆపుకుంది మాధవి.

'ఇంకెల్లా మాట్లాడను మాధవీ? నా పరిస్థితి నీకు కొంచెమైనా అర్థమవుతోందా? నువ్వు ముఖం తప్పించి తిరుగుతున్నావు. నీతో వంటరిగా మాట్లాడాలంటే అవకాశం దొరదు. పిలిచినా నువ్వు రావేమోనని ఒక అర్ధం






లేని భయం నాకు. మా నాన్న చూడు ఎల్లా వ్రాశారో!' బల్లమీదున్న ఉత్తరం పట్టుకొచ్చి పడేశాడు మాధవి ముందు. ఆమె వ్రేళ్లతో దాన్ని పట్టుకొని చూడ పోయింది.

'ఇంత సంపాదించుకుంటూ యింకా ఆ గదేమిటినీకు, ఏమిటంత ప్రత్యేకత' అని స్నేహితులు ప్రశ్నలు.' అన్నాడు అదే వూపులో, ఏం, ఈ గదికి ఏమి వచ్చింది? వాళ్ళ అంటేమాత్రం మీరు జవాబు చెప్పలేరా, అని అడిగాలని ఆమెకి. కానీ కీలాకదారిన మళ్లింది అతని ధోరణి.

'రాజారావు నిన్ను పెళ్లిచేసుకోవాలని అనుకున్నాడని నాకు తెలిసింది గనా! ఇప్పుడు భార్యపోయాక, ఆమె చెల్లెలిని పెళ్ళాడ్డం శాస్త్రీయం కనక అల్లా అనడం చాలా సబబుగా వుంది. అందులోనూ బ్రహ్మమూర్తులైన శ్రీ శివ శాస్త్రుల్లవారికి యిల్లాంటి ఆలోచనలు తక్షణం వచ్చుతాయి కనుక మరీ బాగుంది. ఇంక నా సలహా నీకు ఏవిషయంలో కావాలి మాధవీ?' పట్టలేకుండా అనేస్తున్నాడు అతను మాటలు. ఒకసారి దొరికిందికదా అవకాశం అన్నట్లు అనేస్తున్నాడు.

'నన్ను ఏమని సలహా యిమ్మంటావు? రాజారావు నాకంటే డబ్బున్న వాడు, నాకంటే అందమైన వాడు. చచ్చిపోయిన మీ అక్క కూతురికి తండ్రి. నువ్వు పెళ్లి చేసుకో అని చెబితే నీకు నచ్చుతుందా? అదేనా నీకు కావలసిన సలహా?'

మాధవికి ఏడుపు వచ్చేసింది. 'అది కాదు అది కాదు' అని అడ్డు పెట్టబోతూ ఏడుస్తోంది.

కొంచెం సేపయాక అతను, 'వెళ్ళు మాధవీ! అర్ధరాత్రయింది. నువ్విట్లా వుండగా మీ వాళ్ళు వచ్చిచూస్తే పెద్ద గొడవ ఔతుంది. వెళ్లి పడుకో' అని అతను ఆమె చేతిలోంచి ఉత్తరం లాక్కుని బల్లమీద పడేశాడు.

ఆమె తమాయించుకుని కళ్ళు తుడుచుకుంది

'ఎందుకంత అన్యాయంగా మాట్లాడుతారు? నాకు ప్రపంచమంతటిలోకి మీరు కావలసినవారు అనుకోబట్టి వచ్చాను మీ దగ్గరికి. నన్ను ఎందుకిల్లా దూరం చేస్తారు? మాటలతో పొడిచి చంపుతారెందుకు? బాగ అందమైనవాడు, డబ్బున్నవాడని నేను అన్నానా?' అన్నది.

'నువ్వు అనక్కర్లేదు — అది నిజం. నాతో నీకున్నది అతి స్వల్ప పరిచయం. అక్షరాలా అది ఋణానుబంధం. అది తీరింది. ఇంకేమిటి నాతో పని? నేనూ పొరబడ్డాను. మునిగిపోయిందేముంది? నాకు యివ్వాల్సిన మరో రెండువేల చిల్లర — అదీ ఇప్పిస్తావు వడ్డీతో, సంపాయించుకుంటున్నావనివి' అన్నాడతను.

'అదే అనవద్దన్నాను. డబ్బు ప్రసక్తి తీసుకురాకండి మన విషయంలో.'

'సరే ఆ రెండువేల సంగతి కూడా మర్చిపొమ్మంటావా? అల్లాగే, మా నాన్న

ఆడిన నిష్ఠూరం ఎల్లాగూ ఆడారు; ఇంక రెండువేలే కదా? నాలుగు నెలల జీతం వాడి కాదనుకుంటే అదీ పూడు తుంది' అన్నాడు.

# అపరాజిత

మాధవి అల్లాగే తలవంచుకుని కూర్చుంది. అతనూ అల్లాగే కూర్చున్నాడు దీపం వంక చూస్తూ. ఇంత అర్ధరాత్రి నిశ్శబ్దంలో, ప్రేమానుబంధితులైన వారి మనస్సుల్లో రాగం ఉదయించడం లేదు. కళ్ళలోతుల్లోకి చూస్తే ఎదలో కోరికలు మొగ్గ తొడగడం లేదు. జరిగినదంతా నిజమా అన్న ఆశ్చర్యం, నిజమేకదా అన్న నిరాశ, దీపాల దారులు నడిచి వచ్చేశామన్న వెలితీ వున్నాయి అతని చూపుల్లో. ఎందుకిల్లా మాట్లాడుతాడు, పార్కులో తన చేయి పట్టుకుని పాణిగ్రహణం చేసిన యితను ఎందుకిల్లా మాట్లాడుతాడు అన్నబాధ ఆమెమనస్సులో మండుతోంది.

'వెళ్ళు మాధవీ!' అన్నా డతను.

'వెళ్ళిపోనా? ఇంకేమీ లేదా?' అన్నదామె ఎంతో మెల్లిగా.

'ఇంకేముంది? ఆ పిల్లని చూడాలన్నావు, ఎల్లా చూస్తావు వంటరి దానివి? రాజారావుగారింట్లో వుండి చూడటం మంచిది. అల్లాగే చూడు.' అన్నాడతను. లేచి నిలబడ్డాడు. కదలకుండా కూర్చున్న ఆమెవంక చూశాడు. దీపం వెలుగు తలమీద పడి రేగిన ముంగురులు...మెరుస్తున్నాయి. దీనంగా వాలిన ఆమె కనురెప్పలు తేనెరంగుగా కనిపిస్తున్నాయి. ముడుచుకొనివున్న ఆమె చేతులు అనిశ్చయంగా కదులుతున్నాయి. నాకింత దగ్గరైపోయిన మాధవిని అంత కఠినంగా ఎల్లా ఉండగలుగుతున్నాను అని బుజాలు పట్టి కుదిపి అడగాలనిపిస్తుంది.

అతను వెనక్కితిరిగి మంచంమీదున్న కాగితాలూ, బట్టలూ అన్నీతీసి క్రింద పడేశాడు. దుప్పటి దులిపి వేసుకున్నాడు. మాధవి లేచినిలబడి తలుపువరకు వెళ్ళింది. వెనక్కి తిరిగి చూసింది. అతను యింకా ఏవో సర్దుతున్నాడు. బయటికి వెళ్ళిపోయి తలుపు దగ్గరగా లాగింది.

రెండు నిముషాలాగి అతనువచ్చి తలుపు తీసి బయటికి చూశాడు. అక్కడ ఎవరూ లేరు. గడియపెట్టి వచ్చి పడుకున్నాడు. దీపంవంకే చూస్తున్న అతని కళ్ళల్లో విపరీతమైన అలసట గూడుకట్టుకొంది.

**(ఇంకా వుంది)**

వెంకన్న మస్తుగా త్రాగి డ్యూటీలో కొచ్చాడు. వాడు త్రాగినందుక్కాదు. మాట తప్పినందుకు నాకు మహా చెడ్డ కోప మొచ్చింది.

'గెటవుట్ ... రాస్కెల్...' అంటూ గట్టిగా అరిచాను. వాడంతటితో వెళ్లి పోయినా బాగుండేది. ఏదో చెప్పబోతుంటే మరీ రెచ్చిపోయాను.

మెడమీద చెయ్యి వేసి ఒక్కతోపు తోశాను. వెంకన్న బిళ్లబీటుగా ఎడిపోయాడు. ఆఫీసులో అంతా మూగారు. సాను భూతి వెంకన్న మీదున్నా అంతా నన్నే సపోర్టు చేశారు. వెంకన్నకేం దెబ్బ తగ్గల్లేదు. కాని ఈ సంఘటన నన్ను గాయ పరచింది.

అసలు వెంకన్నను శిక్షించడానికి నేనెవర్ని? నీతి నియమాల పరిరక్షణకు నేనేమీ కంట్రాక్టు తీసుకోలేదుగా? వెంకన్న ఆఫీసు డ్యూటీలో నాబంట్రోతు. డ్యూటీలో అవకతవక లేనంతకాలం వెంకన్న త్రాగితేనేం? తైతెక్కలాడితేనేం? తోటి మానవుణ్ణి శిక్షించే అధికారం నా కెక్కడిది?

నా ప్రవర్తనకు నేను మనసులో క్షమాపణ చెప్పుకున్నాను. కాని పైకి ఆమాట చెప్పలేకపోయాను. నా హోదా అడ్డొచ్చింది. ఒక బంట్రోతుకు క్షమాపణ చెప్పుకోవడమా?

ప్రపంచ జ్ఞానం తెలియకముందు త్రాగడం ఒక ఖరీదైన లగ్జరీ అనుకునే వాణ్ణి. ఎగ్జిమాలాగా డబ్బుగలవాళ్ల సొత్తనుకునేవాణ్ణి.

దరిద్రులూ త్రాగుతున్నారు. వాళ్ల మాటేమిటి?

రోజంతా యిదే ఆలోచనలో, బుర్ర వేడెక్కిపోయింది. సాయంత్రం అలా పార్కువైపుకు నడిచాను. అక్కడా వెంకన్న ప్రత్యక్షం. బెంచిమీద పడుకుని కూనిరాగాలు తీస్తున్నాడు. ప్రపంచం ఏమయిపోయినా తనకు ఫికరు లేనట్లుగా వున్నాడు. నిజం చెప్పాలంటే మామూలు స్థితిలో పొందలేని ఆనందాన్ని యిప్పు డనుభవిస్తున్నాడు.

ఆఫీసుకాదు గనుకా, అహం అప్పటికే వచ్చి వుండటం వల్లా వెంకన్నను ఆస్థితిలో పలుకరించడానికి నాకభ్యంతరం లేకపోయింది.

'వెంకన్నా పిల్లలంతా కులాసాయేనా?'



# భయపెట్టాను అంతే!

వెరెకన్నా నా వంక చూశాడు. ఆస్థితిలో కూడా నాతో మర్యాదగా ప్రవర్తించడం నాకాశ్చర్యం కలుగ జేసింది.

బాగా నిషాలో వున్నందువల్ల వెంకన్న మాటల్లో ఒక సీక్వెన్సు లేదు. కాని చెప్పింది కుండబద్దలు గొట్టి చెప్పాడు. మాట్లాడిందాన్లో సగానికి పైగా బూతులు. అయినా ఎంతో వేదాంతం వుంది. చెప్పింది మోటుగా చెప్పినా నిజం చెప్పాడు. గుండెల్ని మండించే నిజం చెప్పాడు. సంఘం మీద తన అక్కసు తీర్చుకున్నాడు. ఆవేదనంతా వెళ్ళగక్కాడు.

వెంకన్న చెప్పిందంతా కలగాపులగం. బూతుల్లో వేదాంతం. వేదాంతం మధ్య సంఘం మీద కసి. ఇంతలోనే జీవితం మీద విసుగు. సముద్రపు అలల్లా హెచ్చులూ, తగ్గులూ. అందుకే ఎడిటింగ్ అవుసరం. వెంకన్న మిగతా క్షోభనంతా ఒక ప్రక్కకు నెట్టి, అసభ్యపు మాటల్ని సెన్సార్ చేసి కావలసినంత మటుకే నా మాటల్లో చెబుతాను.

'పిల్లల్నమ్ముకోడం మీ రెన్నడైనా విన్నారా?' వెంకన్న ప్రశ్నించాడు. పుస్తకాల్లో చదివాను: విన్నాను కూడా. ఆ మాటే చెబితే వెంకన్న టాపిక్ మార్చి మరోసంగతి చెప్పే ప్రమాదం వుంది. అందుకే 'విన్లేదు' అనేశాను గబుక్కున.

'నేనమ్మాను నా పన్నెండేళ్ల కొడుకుని సాలుకు వందరూపాయల కమ్మేశాను'

'బుద్ధిలేని వెధవలు సంతానం తగ్గించుకో మంటారు. ఎందుకూ? సంతానాన్ని డబ్బు కిందికి మారిస్తే? బోలెడు గిరాకీ. ఏ క్షణంలోనైనా అమ్మెయ్యొచ్చు. కొనడానికి బోలెడుమంది. పదిమంది పిల్లలుంటే వాళ్ళు తలో వందా సాలుకి తెస్తుంటే తల్లిదండ్రులకు లాభం కాదూ? ఇంతకీ పిల్లల్ని కనడానికి మనమేం కష్టపడనక్కర్లేదుగా? ఒకప్పుడు నా అభిప్రాయం.

నాకు ఆరుగురు సంతానం. నా పెళ్ళాం ముప్పయ్యేళ్ళకే ముసిల్దయి పోయింది. మాయింటి దానితోటిది రత్తమ్మ యిప్పటికీ పిటపిట లాడుతోంది.

మాచంటోడి పుటకలకి నా పెళ్ళాం జబ్బుడి పోయింది. అసలు చచ్చి పోవలసిందే. డాక్టరు నన్ను పిలిచి చివాట్లు పెట్టాడు. మరోపిల్ల పుడితే నా పెళ్ళాం నాకు దక్కదన్నాడు. అప్పుడర్థమయింది. పిల్లల్ని కనడం మగాడికెంత తేలికో ఆడదానికంత రాపిడని. డబ్బులేకపోతే మరీను.

జబ్బుపడ్డ మా యింటిది తిరిగి మనిషి కాలేదు. నాకు కష్టాలు మొదలయినవి. ఎవరో అన్నట్టు కష్టాలు వస్తే గుంపులు గుంపులుగా వస్తవి. ఒంటరిగా రావు.

నాజీతం మీకు తెలుసుగా? ఆ జీతంతో యింతమందిని పోషించడం మానవుడి తరమా?

అందుకే అప్పులు చేశాను, తీరుద్దామనే సదుద్దేశంతోనే. కాని తీర్చలేక పోయాను. క్రమంగా నా జీతంలో సగం పైగా వడ్డీల క్రిందే కాబూలీ వాళ్లకు పోతుండేది : నా పరిస్థితి అధ్వాన్నం అయిపోయింది. ఇంటికి వెళ్లడానికే రాను రాను భయమేస్తోంది. తిండిలేకమాడుతున్న సంతానం — జబ్బుతో కృశించిపోతున్న భార్యా—అప్పులబాధ.

'ఇలాంటి పరిస్థితి మీ కెన్నడైనా కలిగిందా ?' నన్ను ప్రశ్నించాడు.

'వద్దు...వద్దు...పగాడిక్కూడా వద్దు' అన్నాడు మళ్లీ తనే.

'కృశించి పోతున్న పిల్లల్ని చూడలేక రెండు మూడిళ్లలో పనిచెయ్యడం మొదలెట్టింది నా భార్య. కడుపుతీపి అలాటిది. రోజూ ఎంతో కొంత చద్దన్నం పిల్లలకు దక్కుతుండేది. పిల్లలు తింటున్నప్పుడు ఆ తల్లిపొందే ఆనందం ఎవరు వర్ణించగలరు ?

'నాకు త్రాగుడలవాటయింది. కాదు చేసుకున్నాను. సరదాకోసం కాదు. నిజపరిస్థితుల్ని ఎదుర్కోలేక చాటుగానైనా సుఖపడాలనే స్వార్థంకొద్దీ. నిజం చెప్పాలంటే త్రాగుడు మొదలెట్టాక సుఖపడుతున్నాను. గవర్నమెంటు తిండి పెట్టకపోతే పోయె. ఎవరిమానాన వాళ్లని బ్రతకనివ్వదు. త్రాగడం మంచిదిగాదని నిషేధించారు.

'అమ్మ పెట్టాపెట్టదు. అడుక్కు తినా నివ్వదు.'

'నాభార్య ఒకరోజు హఠాత్తుగా ఒక కబురు తెచ్చింది. దీనమైన కళ్ళు వాడిపోయిన ముఖం, ఆమె హృదయంలోని సంఘర్షణకు నిదర్శనాలు.'

'రావుణ్ణి పన్లో పెడదామా?' అడిగింది.

'నీకు మతిగాని పోయిందా? ఆడి కెన్నేళ్ళూ?'

'పన్నెండు రేపు సంకురాత్రికి నిండుతాయి.

'పన్నెండేళ్ల వాడు, తనపని తాను చేసుకోవడమే రానివాడు మరోయింటికి చాకిరీకి వెళ్లడమా? నా కడుపున పుట్టబట్టేగా ఈ అన్యాయం? నేనేం మేడలు కావాలన్లేదు. కార్లు కావాలన్లేదు. కలిగిన వాళ్లతో సమంగా వుండాలనడానికి నేనేమీ కమ్యూనిష్టుని కాదు. కనీసం కన్నకొడుకుని వయసొచ్చే వరకూ నాదగ్గరుంచుకునే అదృష్టం కోరుకోవడంకూడా తప్పేనా ? ఇంతకన్నా పశులు నయం, జంతువులు నయం.'

నా భార్య వివరించింది.

'నేను పనిచేస్తే యింటివారి బంధువులకు పనికుర్రవాడు కావాలట. వాళ్లకు గుంటూర్లో పుగాకు కంపెనీ వుందట. తిండీ, బట్టాయిచ్చి సాలుకి వంద రూపాయలక్కు దిర్చాను!' అంది.

'నన్నడక్కుండా ఎందుకు మాటిచ్చావు? అంతా నీ యిష్టమేనా ?' గట్టిగా అరిచాను.

నాకోపం కట్టలు తెగింది.

'మరేం చెయ్యమంటవు? ఒకడిబరువు తగ్గినా తగ్గినట్టేగా?'

'నా చెంప చెళ్ళుమనిపించి నట్లయింది. ప్రయోజకత్వం లేకపోయినా మగాణ్ణి అనే అహంభావం నన్ను పశువుని చేసింది. విచక్షణ లేకుండా యిష్టమొచ్చినట్లు బాదేశాను. రావుడు అడ్డుకోకపోతే ప్రాణంతీసి వుండేవాణ్ణి. వాడు ఏడుస్తూ 'అయ్యా... అయ్యా... అమ్మను కొట్టొద్దే' అనడం ఎల్లప్పుడూ నా చెవుల్లో గింగిరు మంటూ వుంటుంది. ఈ సంఘటన నా జన్మలో మరువలేను. నా తెలివితక్కువ కాకపోతే తల్లికంటే వాడిమీద నా కెక్కువ ప్రేమా? గుండెల్లో ఎంతబాధను దాచుకుంటూ ఆ నిర్ణయాని

కొచ్చిందో నాకెందుకర్థం కాలేదు? అప్పుడర్థమయింది అవసరమైతే ఆడది ఎంత కఠినంగానైనా మారగలదు.'

'ఆ సాయంత్రం నేనే తీసుకెళ్ళి రావుణ్ణి గుంటూర్లో విడిచి పెట్టొచ్చాను. పెద్ద బంగళా. ఇంటిముందు పెద్ద తోటా. వేరే నౌకర్లున్నారు. రెండు మూడు కార్లున్నాయ్. ఒక చిన్న సంస్థానం లాగుంది.

'బుద్ధిగావుండి ఇంట్లో అతుక్కుపోతే నీ కొడుకుని మనిషినిచేసే పూచీ నాది' అంది ఇంటావిడ. మనిషిని చెయ్యడమంటే ఆవిడ దృష్టిలో నమ్మకమైన నౌకర్ని చెయ్యడం అన్నమాట.

'అంతా మీ దయ. మీ చేతుల్లో పెడుతున్నాను. కన్నబిడ్డలా చూసుకుంటారని' అన్నాను వుండబట్టలేక. నా మాటలు నాకే అసహజం అనిపించినవి. కన్నవాణ్ణి నేనే బరువు మొయ్యలేక మరొకరి దయా దాక్షిణ్యాల మీద వొదిలేస్తుంటే వాళ్ళకేం పట్టింది? వాళ్ళకు పిల్లల్లేరా? లేకపోతే మటుకు నాలాంటి బికారిగాడి పిల్లలే కావాలా?

శేరుపాలు కుక్కకు పోసిందావిడ నా యెదుటే. దాన్లో వందోవంతు కనికరం రావుమీద చూపిస్తే చాలనుకున్నాను.

'నా కొడుకుని ఆ విధంగా అమ్ముకున్నాను.'

'ఆరాత్రి మా యింటిది తనివితీరా ఏడ్చింది. వోదార్చడానికి నేను ప్రయత్నించలేదు. గుండెల్లో బరువు తగ్గించుకోవాలంటే రెండే రెండు మార్గాలు. బాగా నవ్వడం లేదా బాగా ఏడవడం. మా బ్రతుకులకు నవ్వే అదృష్టం లేదు గనుక ఏడుపే శరణ్యం.' వెంకన్న కొంచెంసేపాగి మరల ప్రారంభించాడు.

'మీకు గుర్తుందా? చిన్నబాబుగార్ని అదేదో స్కూల్లో వొదిలేసిన కొత్తలో అమ్మగారెలా బాధపడేవారో?'

ఇక్కడ నా స్వంత విషయం రెండు ముక్కలు చెప్పాల్సివుంటుంది. మా రెండో వాణ్ణి సైనిక్‌స్కూల్లో చేర్పించినపుడు వాడికి పదోయేడు. స్కూల్లో చేర్పించి నా భార్యా నేను తిరిగొచ్చాము. నా భార్య వారంరోజులు నిద్రపోలేదు. నన్ను నిద్రపోనియ్యలేదు. బయటి వ్యాపకాలనేకం వున్నవాణ్ణి గాబట్టి నా కాట్టే యిబ్బంది లేకపోయింది. కాని ఆవిడ పరిస్థితి వర్ణించలేము. ఎంతసేపూ ఏదో వెలితి ఫీలయ్యేది. వుండుండి వులిక్కిపడేది. వాడొచ్చి కళ్ళుమూసినట్లూ, మారాం చేస్తున్నట్టూ, అన్నం దగ్గర పేచీ పెట్టుకుంటున్నట్లూ ఫీలయ్యేది. తనలో తాను 'చిన్నా' అనుకోవడం నేను చాలసార్లు విన్నాను. నాకు జాలివేసింది. చేర్పించిన వారం రోజులు తిరక్కుండానే తీసుకెళ్ళి చూపెట్టి వచ్చాను. అప్పటికి గాని మనిషవ్వలేదు. క్రమంగా సర్దుకోవడానికి సంవత్సరం పైగా పట్టింది. ఇప్పటికి మూడు సంవత్సరాలైనా అన్నరోజుకి వాడి దగ్గర్నుండి వుత్తరం రాకపోతే తల్లడిల్లిపోతుంది. తల్లి హృదయం అలాంటిది.

ఇంతకూ నేను చప్పదలచుకున్నదేమంటే ఈ అనుభూతికి హెచ్చు తగ్గులు లేవు ... గొప్పా తక్కువా భేదం లేదు. కొడుకు నొదిలి నా భార్య ఎంత బాధ పడిందో రావుడి తల్లీ అంత బాధ పడుంటుందనే నేను చెప్పదలచుకుంది.

వెంకన్న ప్రారంభించాడు.

'రెండులనెలు గడిచాయి. నా పెళ్ళాం పోరు భరించలేకపోయాను. చివరకు నన్ను నిందించడం ప్రారంభించింది. నా పెళ్ళయి పదిహేనేళ్ళయింది. నన్నెప్పుడూ దూషించి యెరుగదు. అలాంటిది నన్ను దూషించడం మొదలుపెట్టింది. అందుకే రావుణ్ణి చూడ్డానికి వెళ్ళాను. ఇద్దరం వెళ్ళడానికి డబ్బెక్కడిది?'

ఇంటి యజమాని నన్ను చూసి—

'ఎవర్నువ్వు?'

'రావుడి తండ్రినండి'

'ఎవడా రాముడు?'

నాకు భయం వేసింది. నేను గుటికలు మింగుతుంటే కారు డ్రైవరు చెప్పాడు:

'మనింటో పని కుర్రాడండి.' అని.

'అలాగా?' అంటూ కారు స్టార్టు చేసుకుని వెళ్ళిపోయారు.

'కొడుకుని చూడ్డానికి వొచ్చావేమిటోయ్' ఇంటావిడ పలుకరించింది.

'అవునమ్మ! గుంటడెలాగున్నాడో చూసిపోదామని' నసిగాను.

'వాడికేం? పోతులాగున్నాడు. పని పాటు లబ్బడం లేదుగాని.'

ఇంతలో రావుడొచ్చాడు. ఏ మాటకామాట చెప్పకోవాలి మా యింట్లో కన్నా నున్నగా వున్నాడు.

'అయ్యా!' అంటూ వచ్చి నా వొళ్ళో వాలిపోతాడనుకున్నాను. వాడి తల్లీ, తమ్ముళ్ళగురించి ఆత్రంగా అడుగుతాడనుకున్నాను. ఏమీ లేదు. కళ్ళనిండా నీళ్ళు నింపుకున్నాడు. దగ్గరకి రాడు. నాకూ దుఃఖం ముంచుకొచ్చింది. ఇంటావిడ ఇంట్లోకి వెళ్ళింది.



రావుడు పరుగెత్తుకొచ్చి నా వొళ్లో వాలిపోయాడు. ఆ యనుభూతి అనుభవించిన వాళ్లకే తెలుస్తుంది.

'రావుడూ రెండుకిలోల మాంసం పట్టుకురా' ఇంటావిడ సంచీ డబ్బూ యిచ్చింది.

వాడితో స్వేచ్ఛగా మాట్లాడుకునేందుకు అవకాశం చిక్కింది.

'నువ్వుకూడా రా' అన్నాడు రావుడు. ఇప్పటికి వాడి కళ్లలో వెలుగు కనిపించింది.

దారిలో మే మెక్కువగా మాట్లాడుకోలేదు. దగ్గరగా వున్నా మాయిద్దరి మధ్యా ఎంతదూరం?'

బందిఖానాలో ప్రేమ మొద్దుబారిపోతుంది. తండ్రీ కొడుకులను జెయిల్లో పెట్టి పదేళ్లుంచండి? ప్రేమ పెరక్కపోగా నశించిపోతుంది.

దారిలో వాడి తమ్ముళ్ల గురించీ, వాళ్లమ్మగురించీ అడిగాడు. ముసి ముసి నవ్వులు నవ్వుకున్నాడు.

రాత్రి రావుడు పళ్లెంలో అన్నం తీసుకొచ్చి ముందుపెట్టాడు.

'నువ్వో?'

'తరవాత తింటాలే'

భోజనం బాగుంది. ఒక కూరా, పులుసూ, మజ్జిగా, నా యింట్లో యింత వైభోగం యిక్కడిది?

# భయపెట్టాను అంతే!

రాత్రి పదింటికొచ్చాడు రావుడు పడుకోడానికి.

ఇంటివారి వంటోడు పీణ్ణాదిలి ఒక్క క్షణం వుండడు. రెండు నెలల్లో యింత అతుక్కుపోడం పిల్లల్లోనే జరుగుతుంది.

గారేజిలో పడుకున్నాము. నాకెందుకో అనుమానం వేసింది. రావుడు తిండి తిన్నట్టులేదు. వాడికళ్లే చెప్పాయో తండ్రినిగాబట్టి నాకు తెలిసిందో నాకు తెలియదు. ముందు అన్నం తిన్నానన్నాడు. తరువాత ఆకలి కావడం లేదన్నాడు. చివరికి నిజం చెప్పాడు. అన్నం లేదు.

తనవంతు నాకు పెట్టాడన్నమాట. అన్నం ఎలా మిగుల్తుంది? వంటవాడు వండడు. రావుడికి అడిగే ధైర్యంలేదు. ఇంటావిడ కిలాటివి పట్టవు.

అవును నే నెవణ్ణని అజ కనుక్కోవాలి? నే నేమైనా చుట్టాన్నా? స్నేహితుణ్ణా? నౌకర్ల తండ్రిని. నౌకరు తండ్రిని అజ కనుక్కునే మంచితనం ఈ రోజుల్లో ఆశించేంత మూర్ఖుణ్ణి కాను.

'రావుడింత హుషారుగా వుండటం నే నెన్నడూ చూళ్లేదు. ఎప్పుడూ వుసూరుమంటూ వుండేవాడు.' ఒకనౌకరు అన్నంతింటూ చెబుతున్నాడు మరొకడితో.

'అడి బాబొచ్చాడుగదరా?' మరొకడి సమాధానం:

రావుడు హాయిగా నా ప్రక్కలో నిద్రపోయాడు. నేను నా దురదృష్టాన్ని తిట్టుకున్నాను. నా ప్రయోజకత్వాన్ని నిందించుకున్నాను. రావుడికి తిండి పెట్టలేక అమ్ముకున్న తండ్రిని, చివరికి వాణ్ణి మాడ్చి వాడి తిండితినే దౌర్భాగ్యం కలిగినందుకు నామీద నాకే అసహ్యం వేసింది.

తరువాత రెండుమూడుసార్లు రావుణ్ణి చూడ్డానికి వెళ్లాను. ఎప్పుడూ తిండి కాదుగదా పచ్చి మంచినీళ్లు ముట్టలేదు. రావుడు చిన్న బుచ్చుకుంటున్నాడని నాకు తెలుసు. నేను తింటే వాడు పొందే ఆనందం కన్నా వాడితిండి తిన్నందుకు నేను పడే వ్యధ అనేక రెట్లెక్కువ. అందుకే వాడికా కాస్త ఆనందంకూడా దక్కనియ్యలేక పోయాను.

ఒకసారి ఇంటావిడ నన్ను గట్టిగా హెచ్చరించింది.

'మాటిమాటికీ యిలా వస్తూవుంటే కుర్రాడు బెంగెట్టుకోడూ?' నా చెంప చెళ్లుమనిపించినట్లయింది. దీనర్థం నా కొడుకుని చూసుకోవద్దనేగా? ఇదేం న్యాయం? ఒక తల్లి అనవలసిన మాట లేనా యివి? మాతృత్వాన్నికూడా మరచిపోయేంత పైశాచికత్వం మనుష్యుల్లో ఎలా ప్రవేశిస్తుంది? రావుడూ ఒక తల్లి కొడుకనీ, తను పడ్డంత ప్రసవవేదన ఆతల్లీ పడుంటుందనీ, బిడ్డలవల్ల తాను పొందుతున్న ఆనందపు తరంగాలన్నీ రావుడి తల్లీ పొందివుంటుందనీ ఎందు కనిపించదు? అనిపించదు. డబ్బు అనిపించనివ్వదు. భగవంతుడా! ఈ డబ్బనేది లేకపోతే మానవుడింత దిగజారిపోయివుండేవాడు కాదేమో?'

వెంకన్న కొంచెంసేపు మాట్లాడలేదు. తనలో తాను ఘర్షణ పడుతున్నట్లు వాలకం చెబుతోంది. ముఖం వల్లబడి చావుకళొచ్చింది.

'నిన్న ఈ వుత్తరం వచ్చింది'అంటూ వొక కార్డు తీసి నాకిచ్చాడు.

'నీ కొడుకుని వెంటనే తీసుకు పో. వివరాలు నీకే తెలుస్తవి.'

రెండే రెండు ముక్కల్లో ఎవరో వ్రాశారు. బహుశా రావుడు పనిచేస్తున్న మరో నౌకరయివుండాలి.



'ఏదో కీడు జరిగిందని నా మనసు కనిపించింది. నా కాళ్ళు నిలువలేదు. అందుకే యింట్లో చెప్పకుండా శెలవు చీటీకూడా ఆఫీసులో యివ్వకుండా వెళ్ళిపోయాను.'

శెలవుపెట్టకుండా గైరు హాజరయినందుకు నేను వెంకన్నకు నాగా వేశాను. డిసిప్లిన్‌కు విరుద్ధంకదూ మరి?

'నేను వెళ్ళేసరికి రావుడు గరేజిలో ఒకమూల మునగదీసుకు పడుకునున్నాడు.'

'రావుడూ!' అన్నాను. నా గొంతు జీరబోయింది!'

'అయ్యా!' అంటూ రావుడు కదిలాడు!

'ఏం జరిగిందిరా?' ఆత్రంగా అడిగాను. రావుడు సమాధానంగా మూలిగాడు. నుదుటిమీద చెయ్యివేసిచూశాను. వొళ్ళు మాడిపోతోంది. వీపుమీద చెయ్యివేసి దగ్గరకు లాక్కున్నాను.

'అబ్బా! అంటూ బాధగా మూలిగాడు రావుడు. చొక్కా తప్పించి చూశాను.'

'వాతలు...ఒకటికాదు...రెండు కాదు... పన్నెండు వాతలు...'

'నేనింకా తేరుకోకముందే యింటావిడ విరుచుకుపడింది.

'నీ కొడుకేంచేశాడో తెలుసా?' నేను సమాధానం యిచ్చేస్థితిలో లేను!

'సాయంత్రం వేళ బాబుని తోపుడు బండిలో వేసుకుని అలా తిప్పుకు రమ్మన్నాను. అదీ కష్టమే? నీ కొడుకు ఆటల్లోపడి బండిని నడిరోడ్డుమీద వొదిలేశాడు. ఇంకా నయం. గండం తప్పింది. సైకిలయిపోయిందిగాని అదే కారయినా అంతేగా? అదృష్టం బాగుంది గనుక మాబాబు దక్కాడు.' ఇంతలో బాబుని మరొకడు ఎత్తుకుని తీసుకొచ్చాడు. దెబ్బలేం తగిలినట్టులేదు. హమ్మయ్య! అనుకున్నాను. అభియోగాన్ని ఎదుర్కొనే ధైర్యం వచ్చింది.

'నౌకర్లంటే అంత అజాగ్రత్తగా వుంటే ఎలా? అందుకే కొంచెం భయపెట్టాను' ఇంటావిడ ముగించింది.

నాకు గట్టిగా అరవాలనిపించింది. ఎవర్ని కొట్టలేను గనుక నాతలను నేనే -దుక్కోవాలని పించింది. అల్లరి చెయ్యాలనిపించింది. నాకసి తీరేందుకు వేరే గత్యంతరంలేదని పించింది.

'లావులూ!' బాబు పిలిచాడు చేతులూపుతూ.

రావుడు అంత బాధలోనూ చిరునవ్వునవ్వాడు.

బాబు పిలుపులో మాలిన్యం లేదు.

బాబు పిలుపులో శత్రుత్వం లేదు.

రావుడి నవ్వులో ప్రతీకారం లేదు.

ఈ సంఘటన నాకు వివేకాన్నిచ్చింది. ఏ అఘాయిత్యాన్నీ చెయ్యనియ్యకుండా పట్టిలాగింది.

రావుణ్ణి యింటికి తెచ్చుకుంటున్నాను. నౌకర్లలో ఒకడు పరుగెత్తుకుంటూవచ్చి నాకొక సలహా యిచ్చాడు.

'పోలీసు రిపోర్టిచ్చెయ్' అన్నాడు.

'పోలీసులు వాతలకు మందేస్తారా?' అన్నాను. నావైపు అదోరకంగా చూశాడు. మరల ఏదో చెప్పబోయాడు.

'వద్దు ...వద్దు' వారించాను.

వెంకన్న కొంచెంసేపాగి మరల ప్రారంభించాడు.

'త్రాగుడు గౌరవం కాదని నాకు తెలుసు కాని నేనేం చెయ్యను?

'త్రాగకపోతే యేనాడో ఆత్మహత్య చేసుకుని వుండేవాణ్ణి. అప్పుడు నా పెళ్ళాం పిల్లల గతేంగాను? త్రాగకపోతే యిన్ని కష్టాలు భరించే శక్తి ఎక్కడనుండొస్తుంది? పౌరుషంగా రావుణ్ణి యింటికి తీసుకొచ్చాను. మందిప్పించడానికి దమ్మిడీ లేదు నా దగ్గర. అయినా హాయిగా నాకేం పట్టనట్లు తిరగ్గలుగుతున్నాను. ఇంట్లో తిండివుండదని నాకు తెలుసు. అయినా యింటిది ఎలాగో తంటాలుపడి గంజయినా పోస్తుందని నా ధీమా. త్రాగకపోతే యింత బేఫికరుగా వుండేవాణ్ణా?' వెంకన్న ప్రశ్నించాడు.

వెంకన్న అభిప్రాయం తప్పు అని నిరూపించడానికి కావలసిన విజ్ఞానం నావద్ద లేకపోలేదు. కాని వెంకన్న అర్థం చేసుకునే స్థితిలో లేడు. పోనీ నేనైనా వెంకన్న నర్థం చేసుకున్నానా? ●

# రచయితలకు మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాతప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాతప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో యిటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంపనవసరం లేదు. 100 అరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమంలో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్ర సచిత్ర వారపత్రిక



'...' అన్నారు రఘుపతిగారు ఆప్యాయంగా.

'అదృష్టవంతుణ్ణి' అనుకున్నాడు స్వామి.

ఆనందం కూడా తనను గురించి అలాగే అనేవాడు.

ఎన్నడో చిన్ననాడు రంగాజమ్మ చెప్పిన కథ గుర్తుకు వచ్చింది స్వామికి.

'అనగనగా ఒకరాజు. పిల్లలు లేకుండా కన్నుమూశాడు. మహామంత్రులవారు ఒక ఏనుగును పూలదండతో నగరంలోకి పంపారు. ఆ పూలదండను— ఆ ఏనుగు-ఎవరిమెళ్లో వేస్తే – అతగాడు – ఎవరైనా సరే– ఆ రాజ్యానికి రాజు కావాలి– అదీ నిర్ణయం.

జనసందోహంతో కిటకిట లాడాయి నగరవీధులన్నీ. వీరాధివీరులు మెడలు చాచుకుంటూ— బారులుతీర్చి నిలబడ్డారు. ఏనుగ బయలుదేరి నడుస్తూంది అదృష్టదేవతలా.

నడిచి నడిచి ఒక మారుమూల అడుక్కుతింటున్న ఆ కుర్రవాడు – బక్క పేగులతో – చింకిరిజుట్టుతో– ఆ రాజ్యానికి ప్రభువైపోయాడు. మూలుగుతున్న ఒక అనాథ మెడలో ఆ తర్వాత జరిగిన స్వయంవరంలో– వేసింది ఆ పూలదండ! అంతవరకూ అప్సరసలాంటి రాకుమారిని అతగాడు వివాహమాడాడు. కలకాలం సుఖశాంతులతో రాజ్యంచేసి...'

'అదృష్టవంతుణ్ణి' అనుకున్నాడు ఆ రోజే ఆ ఊరి మిడిల్ స్కూల్లో ఏడో టీచరుగా జేరిన స్వామి,

శిఖరేశ్వరస్వామి!

బళ్లో పిల్లలకు ఉద్యోగంలో చేరిన తర్వాత మొదటిసారి పాఠం చెప్పి — తృప్తిగా అలిసిపోయి, రఘుపతిగారింట్లో భోజనం చేసి—పడుకుంటున్న సమయంలో గూడా అలాగే అనుకున్నాడు మళ్లీ.

ఇన్నాళ్లకు తాను ప్రయోజకుడయ్యాడు.

'కాని నువ్వెళ్లి ఎలా బ్రతుకుతావో రా బాబూ! అభం శుభం తెలియని వాడివి.' అంటూ ఆడపిల్లను అత్తవారింటికి సాగనంపుతున్నట్లు బెంగడిపోయింది తల్లి సీతమ్మగారు. ఆ ఊరు వస్తున్నప్పుడు తన మనస్సు కూడా రవ్వంత తికమక పడినమాట నిజం.

ముందు సత్రంలో మకాం పెట్టి — మరునాడే తోటి టీచరు పరాంకుశంతో కలిసి అద్దెకు గది వెతుక్కుంటూ బయలుదేరాడు.

రావిచెట్టు దగ్గర ఎదురయ్యారు

## కొత్త సీరియల్ ప్రారంభం!

రఘుపతిగారు తనను పరికించి చూసి 'ఎవరయ్యా ఈ అబ్బాయి' అన్నారు. తన భోగట్టా అంతా వినయ విధేయతలతో చెప్పుకున్నాడు స్వామి.

'అన్నప్ప శాస్త్రి మనవడివిటోయ్? చెప్పావు కాదేం! మనం చుట్టాలమయ్యా' అని భుజం చరిచారు రఘుపతిగారు. ఆ తర్వాత 'మా యింటి ముందు గదిలో ఉండవయ్యా నిక్షేపంగా' అంటూ సాదరంగా ఆహ్వానించారు. గది బాగుంది. 'అద్దె ఎంతండీ?' అన్నాడు.

'ఎంత అజ్ఞానివి బాబూ' అన్నట్లు నవ్వి— 'అద్దెదేముందయ్యా? నీ లాంటి బుద్ధిమంతుడు యింట్లో ఉండాలిగానీ' అనేశారు అతి తేలికగా.

'కాదండీ! ఒకరోజూ రెండురోజులూ అయితే ఫర్వాలేదుగాని—'

'రెండు రోజులు కాకపోతే రెండేళ్లుండవయ్యా. పదీ అయిదూ నువ్వు నాకు అద్దె యివ్వకపోతే గడవదంటావా?'

అద్దె లేకుండా ఉండటం న్యాయమనిపించలా స్వామికి. నలుసంత చుట్టరికం వుంటే మాత్రం—ఒకళ్ల మంచితనాన్ని అంతగా వాడుకునే తత్వంకాదు తనది. కొంత తర్జన భర్జన జరిగిం తర్వాత అంతగా ఒకళ్లకెందుకు ఋణపడాలి?' అనే అభిప్రాయం నీకుంటే—మా అమ్మాయికి నాలుగు ముక్కలు ట్యూషన్ చెప్పు. దానికే దానికి సరిపోయిందనుకో పోనీ' అంటూ తనకు తృప్తి కలిగించే రాజీ మార్గం కూడా చూపించారాయన.

'కలసొచ్చే రోజులొస్తే— అన్నీ అలా కలిసొస్తాయిగామల్సు. అప్పుడే ట్యూషన్లు కూడా దొరుకుతున్నాయి' అనుకున్నాడు నిండుగా.

పాపం ఆనందం కంటె తాను అదృష్టవంతుడు. ట్రయినింగు పూర్తి చేయకుండానే— అతగాడు చదువు మానుకుని— ఎక్కడో కాంట్రాక్టరు దగ్గర గుమాస్తా ఉద్యోగం చేసుకుంటూ — బతికాల్సి వచ్చింది. ఆ సంవత్సరం కష్టపడి చదివుంటే ఈ పాటికి తనతో పాటు ఉద్యోగం చేస్తూండేవాడు నిక్షేపంగా. పాపం!

'ఎలా బ్రతికినవాణ్ణో నీకు తెలియదులే బాబూ. నిక్షేపంగా సామానులు తెచ్చుకో మరో ఆలోచన పెట్టుకోకు.' అంటూ ఆపేక్షగా ఆహ్వానించారు రఘుపతిగారు.

మండువాయింట్లో ముందు గది శుభ్రంచేయించి ఒకమంచం—మేజాబల్ల— కుర్చీ—మరచెంబు వగైరా సరంజామా ఏర్పాటు చేయించారు గూడా.

అంతేనా! బజారుకుపోయి సంచెడు సామానూ బియ్యం కొనుక్కొంచి స్వయంపాక యజ్ఞానికి సమిధలు పేర్చుకుంటున్న తనను చూసి 'ఎందుకయ్యా అంత రభస పడుతావూ? ఒంటరివాడివి. పట్టెడు మెతుకులు పెట్టలేక పోతామా?' అంటూ మందలించారు గూడా.

రఘుపతిగారి భార్య శారదమ్మగారు కూడా అదే ఆపేక్షతో 'ఈ మాత్రానికే నువ్వు చేతులు కాల్చుకోవాలా బాబూ! బిడ్డలాంటి వాడివి' అంటూ భర్తకు వంతపలికింది.

పార్వతీ పరమేశ్వరులు గుర్తుకు వచ్చారు స్వామికి ఆ దంపతుల ఆదరణ చూస్తే. కేవలం మొహమాటం కొద్దీ వంచిన తల ఎత్తకుండా, రఘుపతిగారి సరసన కూర్చొని—ఆవబెట్టిన పనసకాయ కూరతోసహా కడుపునిండా అన్నం తిని, మూతిదగ్గర చేయి కడుక్కుంటూ 'ఎటువంటి మనుష్యులు!' అని ఆశ్చర్యపోతూ మంచినీళ్లు త్రాగి పలమారగా 'అమ్మ తల్చుకుంటున్నది. ఇటువంటి యింట్లో యింత వసతిగా ఉంటూ యిలా కడుపునిండా భోజనంచేసినట్లు తెలిస్తే ఎంత సంబరపడి పోతుందో వెర్రితల్లి' అనుకున్నాడు స్వామి.

భోజనాలయ్యాక, పడక కుర్చీలో ఠీవిగా కూర్చున్న రఘుపతిగారు 'రావయ్యా రా! తాంబూలం వేసుకో' అంటూ ఆహ్వానించారు ముందున్న కుర్చీ చూపెడుతూ.

'అలవాటు లేదండీ' అంటూ కుర్చీలో బెరకుగా ఒక మూలకు ఒదిగి కూర్చున్న స్వామి వినయసంపత్తిని మెచ్చుకుంటున్నట్లు మందహాసం చేశారాయన.

'చూడబ్బాయ్! నాకు మాత్రం తిండి లేకపోయినా తాంబూలముండాలనుకో. రవ్వంత పచ్చకర్పూరం ఏలకులూ అందులోపడి తీరాలి. తాంబూలం తగినంత పడకపోయిందో తిన్నది అరిగి చావదనుకో. పెద్ద పులులూ సింహాలూ రంకెలు పెడుతున్నట్లే పొట్టలో పేగులు పేట్రేగిపోతాయనుకో. అది కాపరానికి వచ్చినప్పటి నుంచీ యిదే వరస. ఈ పాడు శరీరాలు ఏముంది బాబూ! మైనపు ముద్దలనుకో. అదీ వరస. ఎలా అలవాటు చేస్తే అలా తయారై ఊరేగుతాయి. మా బుజ్జిలు అల్లుడున్నాడు — అప్రాచ్యుడు—ఫ్యాక్టరీ గొట్టంలా ఆ పాడు సిగ



అంజలీదేవి సమర్పించు చిన్నీబ్రదర్స్ వారి



# అమ్మకోసం

నిర్మాత: చిన్నారావ్ B.E., B.S.I.E., (U.S)

కథ-డైరెక్షన్: బి.వి.ప్రసాద్

పర్యవేక్షణ: ప్రత్యగాత్మ

సంగీతం: ఆదినారాయణరావ్

లక్ష్మీ ఫిలింస్ రిలీజ్

LAKSHMI

రేట్లు కొలుస్తూ — ఇల్లంతా ఊదర పెడుతూనే వుంటాడు. మళ్లీ తెల్లవారకుండానే అంటించాలి ఆ కాష్ఠం. ఆ కాష్ఠం మండకపోతే — సూర్యభగవానుడు ఉదయించడు అతగాడికి. కాలకృత్యాలు బందైపోతాయట.'

రఘుపతిగారి మాటలు వింటున్న స్వామిని ఒక ఆలోచన పట్టుకు పీడిస్తున్నది.

'అద్దెకు బదులుగా అమ్మాయికి నాలుగు ముక్కలు చెప్పు బాబూ' అన్నాడాయన. ఆ అమ్మాయి అలికిడి గూడా యింట్లో ఎక్కడా కనిపించింది కాదు. తనకు తెలియకుండా కళ్లు వెతికాయి.

అందుకు కారణముంది.

ఉద్యోగంలో చేరీ చేరగానే ఆవిధంగా ట్యూషను దొరికి 'పై సంపాదన'కు కూడా మార్గం కనిపించడం అల్పమైన అదృష్టంగా కనిపించలేదు స్వామికి. తన చిన్నతనంలో రామబ్రహ్మం మాష్టారు యించుమించు పాతికమంది పిల్లలకు అరుగుమీద పాఠాలు చెపుతూ, చుట్టుపట్ల పల్లెటూళ్లలో గూడా ఎంతో పేరు తెచ్చుకున్నారు. నిజానికి యింటి సంపాదనంతా ఆ ట్యూషన్లమీదనే గడిచిపోయేది. తమ గ్రామంలో ఉన్న పది సంవత్సరాలలో ముగ్గురు కూతుళ్లకూ పెళ్లిళ్లుచేసి, అరఎకరం సుక్షేత్రంలాటి మాగాణీ ఆయన కొనగలిగారంటే ఆయన ట్యూషన్లే కారణం.

తనకు ఆయన ఆదర్శ పురుషునిలా కనిపించారు. 'శ్రద్ధగా చెప్తారు మాష్టారు చదువు — అనే పేరు రావాలి ముందు. ఆ తర్వాత అవే పరిగెత్తుకొస్తాయి ట్యూషన్లు.' అనుకున్నాడు తనకు పట్టిన అదృష్టాలను తలుచుకుంటూ నిద్రరాక రఘుపతిగారిచ్చిన మంచంమీద అటూ యిటూ వత్తిగిల్లుతున్న స్వామి.

'ఆ అమ్మాయికూడా శ్రద్ధగా చదువుకుంటే — తన శ్రమ తప్పకుండా ఫలిస్తుంది.' అనుకున్నాడు. 'అమ్మాయి బుద్ధి పాదరసమనుకో. దానికి ముందు మనిషిమీద గురి కుదరాలి. లేకపోతే యెటువంటివాణ్ణీ లెక్కచేయదు.' అన్న రఘుపతిగారి మాటలు గుర్తుకొచ్చాయి. మనస్సు రవ్వంత బెదిరినట్లనిపించింది.

అనిపించడం కాదు. మర్నాడు తన శిష్యురాలిని చూసీ చూడగానే — నూటికి నూరు పాళ్లూ బెదిరిపోయాడు స్వామి!

* * *

మర్నాటి ఉదయం గూడా తాను ట్యూషను ప్రారంభించే అవకాశం కలగలేదు. అసలు రఘుపతి గారింట్లో పిల్లలున్న జాడే కనిపించలేదు. భోజనం చేస్తున్న సమయంలోగూడా ఆ సంగతి దంపతులలో ఏ ఒక్కరూ మాట్లాడలేదు. తనంత తాను ఆ విషయం మాట్లాడటం మర్యాద కాదని ఊరుకున్నాడు.

సాయంత్రం బడినుంచి తిరిగివచ్చి గది ఊడ్చుకుంటున్న స్వామికి, లోపలి గది కిటికీలోంచి కిలకిల మంటూ నవ్వుతున్న నలుగురు ఆడపిల్లల సవ్వడి వినిపించింది. చీపురు అలాగే పట్టుకొని వంచిన నడుము ఎత్తి చూశాడు.

మెరుస్తున్న ఆరు నక్షత్రాలు కనిపించాయి.

ముగ్గురే అమ్మాయిలు. నలుగురు కాదు. ఆ మెరుపుల భంగిమనుబట్టి, ఎంత కాదనుకున్నా, వాళ్లు తననే చూసి నవ్వుతున్నట్లనిపించింది. తను తలఎత్తి చూడగానే, ఆ ఆరు తారకలూ ఒక్కసారి మాయమైపోయాయి. తను మళ్లీ తలవంచుకుని తన గది పనిలో మునిగిపోయాడు. సర్దుడు అంతా అయాక పిలక జాడించి దట్టించి ముడిపెట్టుకున్నాడు. మళ్లీ ఆ ఆడపిల్లలు ముగ్గురూ విరగబడి నవ్వుతున్నట్లనిపించింది. మరోకసారి కిటికీవంక చూశాడు. మళ్లీ అదృశ్యమైపోయాయి ఆ ఆరు తారకలూ. చొక్కావిప్పి పదిలంగా మడతపెట్టి — అరచేతి వెచ్చదనంతో నలిగిన గుడ్డను మాలీషుచేసి మడతలుతీసి, మంచంమీద దిండుక్రింద పెట్టాడు. పెట్టెలోని తల్లి ఫోటోతీసి తుడిచి గోడమీద మేకుకు తగిలించాడు. ఆ ప్రక్కనే ఎన్నడో ఆనందం యిచ్చిన ఏసుప్రభువు ఫోటో గూడా ఒకటి అలంకరించాడు.

— 'కాఫీ తీసుకోండి మాష్టారూ.'

వెనక్కు తిరిగి చూశాడు స్వామి.

దేవలోకంనుంచి దిగివచ్చిన అప్సరస లాంటి పిల్ల తళుక్కుమంటూ మెరిసింది కళ్ళముందు. ఒస్తున్న నవ్వును ఆపు కుంటానికి విశ్వప్రయత్నం చేస్తున్నది ఆ మెరుపుతీగ.

'ఎలా కొయ్యబారిపోయారేం మాష్టారూ? కాఫీ త్రాగండి' క్రిందిపెదవి బిగపట్టి మునిపంటితో పెదవి కొరుక్కుంటూ ఈసారి ఆపుకోలేక పైకి నవ్వేస్తూ అంది ఆమాట. కిటికీ ఆవలనుంచి మరి రెండు కిన్నెర కంఠాలు విరగబడి నవ్వుతూ ఆమె నవ్వుకు వంతపాడాయి. కిటికీకేసి చూశాడు. ఈసారి నాలుగే తారకలు కని పించాయి.

'భూమిమీద ఆగండే కాస్త తల్లులూ. ఏమిటా వికవికలూ!' రఘుపతిగారి భార్య దొడ్లోనుంచే గావుకేక పెట్టినట్టు అరి చింది.

'మా స్నేహితు— 'రాంద్రే' నాండి ? కరణంగారమ్మాయి అలివేణి — కోనేటిరావు చెల్లెలు భారతి. మా ముగ్గురికీ వంటబట్ట లేదులెండి చదువులు. అందుకే అంత ప్రాణస్నేహం కలిసింది మా ముగ్గురికీ. దానికి పెళ్ళిపిచ్చి. దీనికి సినిమాలపిచ్చి. నాకేమో బట్టలపిచ్చి — మా అమ్మ సుభాషితం లెండి. ఏమైతేనేం ముగ్గురం ఈ పిచ్చిలతోనే అంటుంది అమ్మ — డేకి డేకి ఒక్కొక్క క్లాసూ — ప్రాణం విసు గొచ్చి ఆ పాడుబడికి తిలోదకాలిచ్చాం. భారతికి పెళ్ళై వెళ్ళిపోతుందనుకోండి రెణ్ణెల్లలో. లేకపోతే మేమిద్దరం కలిస్తే మీ పాదాలదగ్గర పాఠాలు వల్లెవేస్తూ జంటకవుల్లా ఘోష పెట్టేవాళ్ళం'

ఉక్కిరిబిక్కిరైపోయాడు స్వామి. తనకు కాబోతున్న శిష్యురాలు — రఘుపతిగారి ముద్దులకూతురు — ఈమె కాదుగదా ?

'గదా?' అనుకునే అవకాశం కూడా కనిపించలేదు.

'చల్లారిపోతున్నదండీ బాబూ. చల్లా రితే పసలేదు, ముక్కుపొడుం పరిమళం తప్ప. నా వుటుకలకు తెప్పించాను మా బాన సైజు కాఫీపొడుం డబ్బా ఆ చిల్లర కొట్టు వీరాస్వామి. పన్నెండేళ్ళ గడి చినా యింకా అమ్ముతూనే వున్నాడు పాక్షాత్తూ ఆ శ్రీ కృష్ణ పరమాత్మ

బ్రాండంటూ. ఖాతాకొట్టు గనక, ఆ తిరుగుతూ పోవడం చూశాడు.

కమ్మదనానికే లొట్టలు వేస్తూ తాగు తూంటాడు నాన్న. కళ్ళు మూసుకు మింగేయండి కషాయం తాగినట్లు. ఆ తర్వాత ఏదన్నా జరిగితే మేం చూసు కుంటాం.'

నివ్వెరపోయిన స్వామి — నిరుత్తరుడై అందుకొని గుక్కలో త్రాగి గ్లాసందిచ్చాడు తిరిగి.

'ఒసోయ్ కొరకంచూ'

బిగ్గరగా లోపలనుంచి శారదమ్మగారి కేక వినిపించింది. త్రుళ్ళిపడినట్లు కది లాడు స్వామి. అతన్ని చూస్తూ ఎక్కెక్కిళ్ళ పట్టినట్టు నవ్వింది అమె.

'ఈ కొంపలో ఉండదలుచుకుంటే ఈ సైరను కూతలకు మీరలా బేజారెత్తి పోగూడదు.' అంటూ అలాగే నవ్వుతూ లోపలికి పరిగెత్తింది ఆ అమ్మాయి. తనకు కాబోతున్న శిష్యురాలు!.

'ఇంత మనిషి! ఇంచుమించు తన కంటె భారీగా వుంది!! ఈమె గారికి చదువు చెప్పటం మాటలా?' అనుకుంటూ ఉత్సాహం నీరసించి నీళ్ళు కారుతూ కుర్చీలో కూలబడ్డాడు స్వామి.

పది నిమిషాల తర్వాత పరికిణీలరాపిళ్ళ గుసగుసలూ, గాజుల నవ్వుల కిలకిలలూ వినిపించాయి మళ్ళీ. ఆ రెండు తారా జువ్వలూ బయటకు దోవ పొడుగునా సిగ్గుల్ని వలకపోసుకుంటూ మెలికలు

'పెళ్ళయ్యేదాకానన్నా చదువుకోవే తల్లీ నాతోపాటు. నాలుగు యింగ్లీషు ముక్కలు నమిలి పారెయ్యడం ఎందుకన్నా మంచిది. చదువురాని మొగ్గలమీద మరీ విచ్చల విడిగా స్వారీ చేస్తారీ మగాళ్ళు' అంటూ రఘుపతిగారమ్మాయి పెడు తున్న కేకలకు సమాధానంగా రెండు చెంబుల చిరునవ్వు వెనక్కు గుమ్మరించి జారిపోయారు వాళ్ళిద్దరు.

'మాష్టారూ! ఇవాళ .. మొదలు పెడ్తారా పాఠాలు?'

'రేపండీ'

'ఎందుకండీ? ముహూర్తం పెట్టారా ఏమిటి?'

'కారండీ! కాదు. ఇవాళ ద్వాదశి. రేపు మంచిది.' అదిగాక వర్జ్యం కూడా వుందీ పూట.'

'నా నెత్తి! ఈ వానాకాలం చదువుకు వర్జ్యాలూ వారాలూ కూడా కావాలం టారా? నాకు యింగ్లీషు చదువుకోవాల నుందండీ. వెంగళ్రావు కూతురు ఆ సరోజ వరస చూశాక మరీ పట్టుదలగా వుంది లెండి. తండ్రి ఆవిడగారిని బోలెడు డబ్బు తగలేసి పట్నంలో దొర సానుల స్కూల్లో చదివిస్తున్నాడులెండి. శలవలకొచ్చినప్పుడల్లా, అక్కడ నమిలిన ఆ పాడింగ్లీషు ముక్కలన్నీ మా ముఖాల మీదనే కక్కేస్తూ మహా ఊదర పెడు



## మమత

తున్నావ్ లెండి. ఆవిడగారి యింగ్లీషు ముక్కలు చూస్తే, వలిచేపాట్ల ఎవరో డాక్టరు కారెక్కించుకుని వీధు లన్నీ తెగతిప్పేతూ. ఏం పాడో మరి. అంతటి డాక్టరయితే మాత్రం? ఆయనగారు కాపరం చేస్తేది ఈవిడగారితోనో ఈవిడగారి యింగ్లీషు ముక్కలతోనో. అంత కాడికి పది యింగ్లీషు బైండు పుస్తకాలు కొనుక్కుంటే పోలా? భూతద్దంతో వెతికి చూసినా రవ్వంత కండ కనిపించని ఈ అస్తిపంజరాన్ని కట్టుకొనే ఊరేగాలంటారా?' ఏమంటారు?'

ఏమీ అనే ధైర్యం లేక నవ్వటానికి ప్రయత్నించాడు స్వామి.

'నారలా సాగి — ఆ భూతద్దాం కళ్ళజోడూ ఆదీను — తాడిలా పెరిగి కూర్చున్న ఆవిడగారిని చూస్తే మీకే ఆశ్చర్యమనిపిస్తుంది. నిజం చూశారూ! పెళ్ళై మెంతయింది?'

రఘుపతిగారి కూతురు మాటలు వింటున్న కొద్దీ — రైలుబండిలా పరిగెత్తి పోగింది స్వామి మనస్సు.

'మీ రెంతవరకూ చదువుకున్నారు మాష్టారూ?' అంది ఉపన్యాసం ఆపి.

'స్కూలు ఫైనలండీ'

'నాకూ చిన్నప్పుడనిపించేదండీ కనీసం స్కూలుఫైనలన్నా చదవాలని. కాని అప్పుడు ధర్డుఫారమే పద్మవ్యూహంలా కనిపించింది. రయోడీ జనిరో ఏ అక్షాంశం మీదుంది? అంటూ నిగదీస్తాడు జాగ్రఫీ మాష్టారు. ఎక్కడ చచ్చిందో మరి. తళ్లికోట యుద్ధం ఎప్పుడు జరిగిందంటాడు బానలాంటి పొట్ట రుద్దుకుంటూ హిస్టరీ మాష్టరు. ఎవళ్లో ఎప్పుడో ఎక్కడో కొట్టుకుచస్తే మనకెందుకు చెప్పండి? వాళ్లెప్పుడో కలిసిపోయారు మట్టిలో. తిరగ మోతలోకి కరివేపాకు రెబ్బలాకూడా కనిపించకుండా. వళ్ళుమండేది నిలబెట్టి యిటువంటి ప్రశ్న లడుగుతున్న పంతుళ్లను చూస్తే. ఒకసారి పిలక ఝాడించుకుంటూ తెలుగుమాష్టారు...'

స్వామి ప్రాణం గతుక్కుమంది.

'క్షమించండి మాష్టారు. మీ ముఖానికి మరీ అంత ఎబ్బెట్టుగాలేదు పిలక. ఆ మాటవరసకు చెబుతున్నా — భయంకరాకార్య—ఏ సంధి? అన్నారు నిలవేసి. చెప్పొద్దూ వళ్ళుమండి — 'భయంకర సంధి' అనేశా. తేలుకుట్టినట్టు ఎగిరి పడ్డారనుకోండి.'

కిలకిలమంటూ నవ్వింది రఘుపతిగారమ్మాయి.

నవ్వు బాగానే వుందనిపించింది. కాని ఆ మాటల్లోని మెరుపులకు మాత్రమే కళ్ళు చికట్లు క్రమ్ముతున్నాయి కంగారు పుట్టి. మారుతున్న కాలానికి గుర్తు రఘుపతిగారమ్మాయి. తన చిన్నతనంలో తన కింత చొరవగా మాట్లాడటం తెలియదు.

'చివరిసారి పరీక్ష రాసినప్పుడండీ — ఇటువంటివే ఎందుకూ పనికిరాని ప్రశ్నలు: ఒక్క సమాధానమూ గుర్తుకు రాక, రేచిక్క ముంచుకొచ్చి—బుద్ధి తెలిసినప్పటి నుంచీ నేను చూసిన టూరింగు సినిమాల లిస్టు కురురుగారాసి, అరగంట కొట్టగానే అమాంతం బయటపడ్డా ఆ బందిఖానాలోంచి. మళ్లీ ఆ ఛాయలకు పోలేదు. నా పేపరుచూసి మాష్టర్లు గుండెలాగడం మొదలుపెట్టి — ఒకరిగుండె లొకరు పట్టుకు హెడ్మాష్టరి దగ్గరకు పరిగెత్తారట. నాకూ మానెయ్యా లనిపించిందనుకోండి బడి. నా తర్వాత నాలుగేళ్ళకు హోటలు కట్టిన వాళ్ళంతా నాక్లాసు మేట్లయి పోతుంటే వళ్ళు మండదా చెప్పండి?'

హరికథ వింటున్నట్టు వింటున్నాడు స్వామి. 'అల్ప్రప్రాణిని. ఆవిడకు నే నెక్కడ చెప్పగలను పాఠం?' అనుకుంటూ బెంబేలు పడిపోయాడు. నిజానికి ఆ వైనం చూస్తే — ఆమెదగ్గరే తను పాఠాలు నేర్చుకుంటున్నాడు—అనే భ్రమ కలిగి తీరుతుంది.

'గురుదేవోభవ' అంటూ చిన్ననాడు తను రామబ్రహ్మం గారిదగ్గర చదువు ప్రారంభించాడు! నిజమే. రోజులు మా

వేగంతో మారిపోతున్నాయి!!. మాష్టరిని తలుచుకుంటే తనకు సింహస్వప్నంలా ఉంటుంది ఈ నాటికీ. పాఠంవచ్చినా, ఒకటికి పదిసార్లు మళ్లీ మళ్లీ వల్లెవేసి వెళ్లేవాడు 'ప్రయివేటు'కు.

అప్పజెపుతున్నప్పుడు తప్పులు రావడం సంగతి దేముడెరుగు? రవ్వంతనట్టినా చింతబరికె వీపుమీద చిరివిరిగేది. కాపీలు సరిగ్గా వ్రాయకపోతే గోడకుర్చీ వేయించేవారు రామబ్రహ్మంగారు. ఎక్కాలు తలక్రిందులుగా అప్పచెప్పకపోతే తొడపాశాలు వడ్డించేవారు. కూడికలుతప్పిన వాళ్లకు మొట్టికాయలు తప్పేవికావు. ఇంతచేసినా మాష్టారు కొట్టారని తల్లితండ్రులకు పితూరీచేసే ధైర్యం సముద్దారుగారి కొడుకు కొండలరావుకుకూడా వుండేది కాదు.

కాని—

ఎంత మారాయి రోజులు!

తనకు దొరికిన శిష్యురాలెటువంటిది?

ఆమె మాటలు వింటున్న కొద్దీ, వళ్లువంచి చదివి తనకు పది మంది ప్రయివేట్లు వచ్చేటట్లు ఆమె చేయగలదనే ఆశ, హారతి కర్పూరంలా హరించుకు పోతున్నది. గుంజీలు తీయించి, తొడపాశాలు వడ్డించి, గోడ కుర్చీలు వేయించి దండించి చెప్పదలుచుకున్న నాలుగు ముక్కల్నీ ఆమె.వంటకు బట్టించగల సాహసం తనకు లేదని స్వామికి తెలుసు.

యుద్ధంలో విజయం తథ్యమని భావిస్తున్న సేనానికి ఆకస్మికంగా అపజయం కళ్లముందు కనిపించి నట్లయింది.

'చదువు వంట బట్టాలంటే పిల్లలకు దెబ్బభయం వుండాలండీ' అంటూండేవారు అటుచూస్తూ యిటు మాటలు వింటూ గండుమీసానికి పదును పెడుతున్న సముద్దారుగారితో రామబ్రహ్మం గారు. రఘుపతిగారి అమ్మాయిని తలుచుకున్న కొద్దీ ఆ మాటలకు— ఈ 'కలికాలం'లో అర్థంలేదని పించింది.

ఆ తర్వాత సంచి పుచ్చుకొని బజారుకు బయలుదేరిన స్వామికి—లైబ్రరీ దగ్గర ఎదురైనతోటి టీచర్ పరాంకుశం 'బజారుకా తమ్ముడూ?' అంటూ ఆప్యాయంగా పలకరించి 'ట్యూషను మొదలుపెట్టినట్లున్నావ్ వచ్చిరాగానే?' అంటూ ఒకప్రశ్న గుచ్చాడు అదోకరకంగా చూస్తూ.

'చూడు తమ్ముడూ! రఘుపతి కూతురు— పావని — అంటే నీ లాంటి గంగిగోవులకు పదిమందికి పాఠాలు చెబుతుంది. కాస్త జాగ్రత్తగా మసులుకోవడం మంచిది' అంటూ హితవు చెప్పాడు పరాంకుశం. మూలుగుతున్న నక్కమీద తాటికాయ పడినట్లయింది. చదువుకునే రోజుల్లో తోటి విద్యార్థులకు గూడా అర్థంకాని పాఠాలు తాను చెప్పేవాడు. 'టీచర్‌కంటె నువ్వు చెప్తేనే నాకు బాగా తలకెక్కుతుందిరా స్వాములూ' అనేవాడు ఆనందం. తనమీద తనకూ అంత నమ్మకం ఏర్పడింది ఆరోజుల్లో. ఆ నమ్మకంతోనే తానుగూడా రామబ్రహ్మంగారిలా ట్యూషన్లు చెప్పి, పదిరాళ్లు సంపాదించి తల్లి వచ్చేసరికి తన ప్రయోజకత్వం నిరూపించుకోవాలను కున్నాడు.

'ఈ ట్యూషను దొరక్కపోయినా బావుండేది' అనిపించింది.

'ఆకాలంలో గురుదేవోభవా — అనుకుంటూ చదువుకున్నారు పిల్లలు. ఈ రోజుల్లో శిష్యదేవోభవా—అనుకుంటూ బ్రతకాలేమో పంతుళ్లు' అనుకుంటూ చిల్లరకొట్టు వీరస్వామి సందత్మన భాగ్యంకోసం, స్వామి చకచకా సాగిపోయాడు.

ఆ విధంగా శిష్యురాలిగా పరిచయమై కంగారు పుట్టించిన రఘుపతిగారి ఒక్కగానొక్క కూతురు 'పావని' అనతికాలంలోనే ఆ మూడుముళ్లూ వేయించుకుని—అగ్నిదేముని సమక్షంలో తనతో పాటు ఏడడుగులు నడిచి — తన భవిష్యత్తునూ జీవితాన్ని శాశ్వతంగా పంచుకుని పరిపాలిస్తుందని — ఆ క్షణంలో నిస్సంశయంగా ఊహించలేదు ఆ ఊరి మిడిల్ స్కూల్లో ఆ క్రితంరోజే ఏదో టీచరుగ జేరిన శిఖరేశ్వర స్వామి!

(ఇంకా ఉంది)

## వసంతవేళ

కోయిల కూసెను
కోయిల కూసెను
తొలి వసంతవేళ యని
ఆనందవేళ అదేయని.

పురులు విప్పి ఆడె నెమళ్ళు
మేను పులకరింపగ పాడె
నెమళ్ళు
తొలకరి మబ్బు కమ్మెనని
తొలి వసంతవేళ అదేయని.

వల్లనిగాలులు మేనుతగుల
ఏవో భావాలు హృదిలో మెదల
తెలిసెను వసంతవేళ అదేయని
ఆనంద డోలిక లూగాలని.

లేత ఆకుపచ్చనిరంగు కోకతో
కురులలో సింగారించిన
చిగురు టాకులతో
మోమున పసుపు నలుముకొని
వసంతుని చేరచనియె వనకన్య.

సిహెచ్. వి. ప్రసాద్

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఉత్తమ నటుడు



నాగేశ్వరరావు

ఉత్తమ నటి



శారద

ఉత్తమ హాస్యనటుడు



రాజ్ బాబు

ఈ సంవత్సరం ఆంధ్రసచిత్ర వారపత్రిక, సింథాల్ సబ్బుని తయారుచేసే గోద్రెజ్ సోప్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారితో కలసి నిర్వహించిన బాలెట్ పోటీలో ఈ కింద యిచ్చినవారు ఉత్తములుగా ఎన్నికైనారు.

ఉత్తమ చిత్రం — మనుషులు మారాలి, ఉత్తమ దర్శకుడు — వి. మధుసూదనరావు, ఉత్తమ నటుడు — అక్కినేని నాగేశ్వరరావు, ఉత్తమ నటి — శారద, ఉత్తమ సహాయ నటుడు — శోభన్ బాబు, ఉత్తమ సహాయ నటి — చంద్రకళ, ఉత్తమ హాస్య నటుడు — రాజ్ బాబు, ఉత్తమ సంగీత దర్శకుడు - కె. వి. మహాదేవన్.

అందరికీ మా అభినందనలు

మొదటి బహుమతి రు.2000
శ్రీ ఎం. రఘునాధరావు,
అనంతపూర్.

రెండవ బహుమతి రు. 750
శ్రీ ఆర్. సురేష్,
విశాఖపట్నం.

పైన పేర్కొన్నవారిని వరుసగా ఉచ్చితంగా రాసిన వారి ప్రవేశ పత్రాలలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక పైన, సింథాల్ పైనా రాసిన అభిప్రాయాలలో అత్యుత్తమమైనవాటిని పరిశీలించి న్యాయనిర్ణేతలు బహుమతులు నిర్ణయించారు.

ఈ పోటీలో న్యాయనిర్ణేతలుగా శ్రీయుతులు డి. వి. నరసరాజు, బాపు, డి. రామలింగంగార్లు వ్యవహరించారు. వారికి మా కృతజ్ఞతలు.

ఉత్తమ దర్శకుడు



వి. మధుసూదనరావు

ఉత్తమ సంగీత దర్శకుడు



కె. వి. మహాదేవన్

**మూడవబహుమతి రు. 500**

**శ్రీ వి. వెంకటరమణశర్మ, విజయనగరం.**

**25 కన్సొలేషన్ బహుమతులు :**

1) శ్రీ బి. మురళీధర్, కంకిపాడు, 2) శ్రీ ఎస్. శ్రీపతి, కరీంనగర్, 3) శ్రీమతి జి. సరోజ, విజయవాడ, 4) శ్రీమతి వి. శకుంతల, ఉంగుటూరు, 5) శ్రీ డి. రామారావు, మదరాసు, 6) శ్రీ జి. ప్రసాదరావు, విజయవాడ, 7) కుమారి ముంగాల రాధ, రాదమండ్రి 8) శ్రీమతి కె. శాయిలీల, విజయవాడ, 9) శ్రీ డి. శ్యామలరావు విజయవాడ, 10) శ్రీమతి జె. లలితకుమారి, విజయవాడ, 11) శ్రీ ఎ. భీమసేనరెడ్డి హైదరాబాదు, 12) శ్రీ ఎ.టి. అనంతరావు, విశాఖపట్నం. 13) ఎస్. అంజనేయులు, తెనాలి. 14) శ్రీ చిలంకుర్తి తులసీరావు, మచిలీపట్నం. 15) శ్రీ కె. నరేంద్రస్వామి, కొత్తగూడెం కాలరీస్, 16) శ్రీ మహమ్మద్ జానీ, గుంటూరు, 17) శ్రీ వి. ప్రజాపతి, భీమవరం, 18) శ్రీమతి ఎ. ప్రభావతి, కాళహస్తి, 19) శ్రీ కె. వి.వి. ఎస్. నరసింహారావు మారేడుబాక, 20) శ్రీ పి. రాధాకృష్ణారెడ్డి, సంతవేలూర్, 21) శ్రీ ఎం. వెంకటేశ్వరరావు, నిడదవోలు, 22) శ్రీ ఎం. సత్యనారాయణ, హైదరాబాదు, 23) శ్రీ అక్బర్ ఆలీఫ్ హుస్సైయిన్, మచిలీపట్నం, 24) శ్రీమతి ఎ. లక్ష్మీనరసమ్మ, విజయవాడ, 25) శ్రీ ఎన్. హనుమంతరావు, విజయవాడ.

మొదటి బహుమతి, రెండవ బహుమతి పొందినవారికి మదరాసులో ప్రత్యేకంగా ఏర్పాటుచేసే సభలో ఆ బహుమతులు అందజేయడం జరుగుతుంది. వివరాలు ఆ విజేతలకి వేరుగా తెలియజేయడం జరుగుతుంది. మూడవబహుమతి, కన్సొలేషన్ బహుమతులుపొందిన వారిలో మొదటి పదిహేనుమందికి ఆ బహుమతులు వారి వారి చిరునామాంకి పోస్టు ద్వారా పంపడం జరుగుతుంది. కన్సొలేషన్ బహుమతులు పొందిన 25 మందిలో చివరి పదిమందికి ఆంధ్ర సచిత్ర వారపత్రిక మూడు నెలలపాటు ఉచితంగా పంపబడుతుంది.

*పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేసినవారందరికీ మా కృతజ్ఞతలు.*

## ఉత్తమచిత్రం

☆

## మనుషులు మారాలి

ఉత్తమ సహాయనటుడు



శోభన్ బాబు

ఉత్తమ సహాయనటి



చంద్రకళ

# ఎన్. టి. రామారావు లోని ప్రత్యేకత



—శ్రీనివాస్

కృషి, కర్తవ్యం; క్రమశిక్షణ రక్ష ఈక్వేట్లు ఎన్. టి. ఆర్; కృషిమీద నమ్మకం. కర్తవ్య నిర్వహణలో చురుకుదనం, క్రమశిక్షణలో రక్షణభారం శ్రీ రామారావులోని అంతర్భాగాలనడం ఉచితం. శ్రీ నందమూరి ఉత్తమనటుడు మాత్రమేగాక ఉత్తమ మానవుడు అని అనేకసార్లు తన సాంఘిక సేవా తత్పరతతో నిరూపించుకున్నారు. నటుడిగా శ్రీ రామారావు సాధించినదేమిటి అనడం కన్నా సాధించని దేమిటని అడగడం సమంజసం.

శ్రీ రామారావుకు 30 సంవత్సరాలు (తెరజీవితం) నిండాయి. ఈమూడు పదుల్లో మూడు ముప్పై చిత్రాల్లో నటించడంకూడా ఒక విశేషం. ఈయన ఆస్తికవాది; ఏది జరిగినా ఆ భగవంతుడి ఆజ్ఞతోనే జరుగుతుందనుకునే వాళ్ళల్లో ఎన్. టి. ఆర్. ముఖ్యులు.

శ్రీ రామారావుకు కోపం ఎక్కువంటారు. కానీ ఆయన ఆవేశంలో అనుగ్రహం కనిపిస్తుంది. ఆగ్రహంలో అభిమానం ద్యోతక మవౌతుంది. పెదవి మీదొకటి మనస్సులో వేరొకటి పెట్టుకోలేని మనిషి శ్రీ ఎన్. టి. ఆర్. మర్యాదయిచ్చి పుచ్చుకోవడంలో ఆయనకు ఆయనే సాటి.

ఏది, ఎప్పుడు, ఎలా చెయ్యాలో బాగా తెలిసిన వ్యక్తి; అందుకే ఫిలిం బ్యాలెన్స్‌లో పాల్గొనడం లేదని వెల్లడించారు. ఇక పై సంవత్సరానికి నాల్గయిదు మంచి చిత్రాల్లో మాత్రమే నటించడానికి నిశ్చయించారు. శ్రీ ఎన్. టి. ఆర్. ను ఒక వ్యక్తి అనడంకన్నా ఒక వ్యవస్థ అనడం ఉచితం.

# "అసమర్థుడైన మంచివాడికంటె సమర్థుడైన చెడ్డవాడే మేలు..."

## అక్కినేని నాగేశ్వరరావు



నటన వేరు, జీవితం వేరు. నిజ జీవితంపై మనుషుల ప్రభావం వేరు. నటుని జీవితంపై పాత్రల ప్రభావం వేరు. నటనలో అనేక పాత్రలు తారసిల్లుతాయి. అనేక పాత్రల్లో పరకాయ ప్రవేశం చెయ్యవలసి వస్తుంది. అన్ని పాత్రలనీ క్షుణ్ణంగా అర్థం చేసుకొని ఆ పాత్రకి ప్రాణం పొయ్యడమే కాదు, ఆ పాత్రల జీవితాన్నీ, మనస్తత్వాన్నీ కూడా వంట పట్టించుకున్న 'అనుభవాల పాత్రశాల'గా నటనకీ జీవితానికీ సంబంధం ఏర్పరచుకున్న మేధావిలా కనిపిస్తారు అక్కినేని నాగేశ్వరరావు.

ముఖానికి వేసుకున్న రంగును కడిగేసుకున్నంత తేలిగ్గా నాగేశ్వరరావు తను నటించిన పాత్రల్ని విడిచి పెట్టుకోలేరేమో అనిపిస్తుంది. అంతేకాదు, పాత్రలకీ ఆయన మీాద అలాంటి అనురాగమే వుండి వుంటుంది! అవి ఎన్నో జీవితాల్ని ఆ నటునిలో ప్రవేశింప జేస్తున్నాయి. నటునిలో మనిషినీ మనసునీ సానపడుతున్నాయి. నిజ మెరిగిన మనిషిలా —నిగ్గు తేలిన నిండయిన మనిషిలా కనిపించే నాగేశ్వరరావు పరిపూర్ణతకి ఒక కారణం అదేనేమో!

### షూటింగే విశ్రాంతి

నాగేశ్వరరావును 'హోటల్ సవేరా'లో కలిసినపుడు చాలా బడలికగా కనిపించారు.

అదే అన్నాను కూడా.

'షూటింగులోనే నాకు విశ్రాంతి. ఎంత తిరిగ్గా వున్నా అంత అలసటగా వుంటుంది. ఇదిగో—కొద్దిసేపు తిరిగ్గా వున్నానో లేదో చెప్పలేనంత టైర్డ్‌గా ఫీలవుతున్నాను...'

అన్నారాయన. తన వృత్తిని ఒక పనిగా భావించకుండా సానపెడ అనందంగా స్వీకరించడంలోనే ఆయన దీక్ష అర్థమవుతుంది!

### సమర్థుడైన చెడ్డవాడే మేలు!

'అసమర్థుడైన మంచి వాడి కంటె సమర్థుడైన చెడ్డవాడి వల్ల ఒక్కొక్కప్పుడు సంఘానికి ఎక్కువ మేలు జరుగుతుంది.'

అన్నారాయన, నేటి రాజకీయాల్ని దృష్టికి తీసుకు వస్తూ. మొదట్లో ఆశ్చర్య మనిపించింది. తాను చెప్పినదాన్ని మళ్ళీ కొంత్క్త చెబుతూ సోదాహరణం చేసిన తర్వాత అది రాజకీయాల్లోనే కాదు, మామూలు జీవితంలో కూడా సాధ్యమైందే అనిపించింది!

అర్థం చేసుకోలేని వాళ్ళకు నాగేశ్వరరావు సమాధానం పెంకెగా కనిపించ వచ్చేమో గాని నిజం అంతే! కావాలంటే నాగేశ్వరరావును తిట్టిచూడండి!

### తిట్టే వాళ్ళని ప్రేమిస్తాను...

'ఓట్లతో మన మంచితనం తరిగిపోతుంది అనుకుంటే ఆ మంచితనానికి విలువేముంది?'

అంటారు అక్కినేని. ఈ గుణం అసాధారణమైనది. ఆయన కొక్కడికే చెల్లుతుందేమో!

తిట్టేవాళ్ళని ప్రేమించే ఆ గొప్ప లక్షణమే ఆయన్ని జర్నలిస్టులకి సన్నిహితం చేసివుంటుంది! జర్నలిస్టులకీ ఆయనకీగల అనుబంధం అంతాయింతా కాదు. ఈ విషయంలో దుక్కపాటి మధుసూదనరావుగారిని సమీక్షిస్తూ:

'విమర్శిస్తూ సంభాషణ మొదలు పెట్టే మధుసూదనరావుగారు నా జీవితంలో పెద్ద జర్నలిస్టు...'

అన్నారు. మధుసూదనరావుగారు జర్నలిస్టా? కాదా? అన్న విషయం కాదిక్కడ ఆలోచించవలసింది, నాగేశ్వరరావు జీవితంలో మధుసూదనరావుగారి పాత్ర!

'ఒక గుండీ పెట్టుకోని వాడికి పెట్టుకోమని చెబుతాం. కావాలని విడిచి పెట్టేసిన వాడికి ఏ ముఖం పెట్టుకు చెబుతాం?'

అన్నది నాగేశ్వరరావు వేదవాక్యం! ఇది కొంచెం ఆలోచించవలసిన సత్యంగానే కనిపిస్తుంది!

### కళ్ళు తెరిపించే కాంపిటీషన్

నటన విషయం వచ్చినపుడు, అందులో ప్రజల తీర్పు విషయం వచ్చినపుడు నాగేశ్వరరావు ధోరణి దూరంగా వున్నట్టు తోచదు.

'నటుడికీ నటుడికీ మధ్య కాంపిటీషన్ వుండాలి. ఈ కాంపిటీషనే లేకపోతే, సర్వాధిపతినే కావరం బయల్దేరుతుంది. అంతతో కళ్ళు మూసుకుపోతాయి'

అన్నారాయన. ఇందులో ఏదో ప్రోత్సాహిచ్చినట్టే కనిపిస్తున్నారు!

### ...నాకు ఫాలోయర్స్ లేరు

'నేను గొప్పవాడిగా చెప్పుకోను. నన్ను ఆరాధించే వారులేరు. 'ఫాలోయర్స్' అంతకన్నా లేరు.'

అంటారు నాగేశ్వరరావు. నిజమే. సన్నిహితులకీ స్నేహితులకీ మధ్య మనిషి మనస్తత్వం ఒక బ్రిడ్జి

### డిగ్రీ లేని పట్టభద్రుడు

తనకి చదువు లేదని అంటుంటారు నాగేశ్వరరావు. స్కూల్లోనూ, కాలేజీల్లోనూ చదువుకున్నదే చదువు అనుకుంటే అది తప్పు అని నాగేశ్వరరావు జీవితం రుజువు చేస్తుంది. నాగేశ్వరరావు

వీర, శృంగార, హాస్యరస ప్రధానమైన మహారాజ్యాల చిత్రం!

తప్పక చూడండి!

శ్రీ గౌతమ్ పిక్చర్స్ వారి

# అలీబాబా 40 దొంగలు

దర్శకత్వం: బి. విఠలాచార్య

నిర్మాత: యన్. రామబ్రహ్మం




డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్ర: గౌతమి పిక్చర్స్, సీడెడ్: విజయా పిక్చర్స్, నైజాం: శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్, మైసూరు సదరన్ మూవీస్

## అక్కినేని

విజ్ఞానానికి, సంస్కారానికి ఏ డిగ్రీ సరిపోదు! ఏ సంతృప్తి కోసం చేస్తున్నా— నాగేశ్వరరావు విద్యకు చేస్తున్న సేవ విలువ కట్టలేనిది.

నాగేశ్వరరావు విరాళాలు ఈ మధ్యనే దక్షిణ భారత యూనివర్శిటీలను చుట్టేశాయి!

### రచయితలకి ప్రోత్సాహం

నటుడుగానే కాకుండా, రచయితగా కూడా పేరు తెచ్చుకున్న నాగేశ్వరరావు రచనలు ఏటా కొన్నివేల రూపాయిల రాయిల్టీని ఇస్తున్నాయట. ఈ రాయల్టీవల్ల ఆదాయం దగ్గరదగ్గరగా ఇరవై వేల రూపాయలు. ఈ డబ్బుని సద్వినియోగం చెయ్యాలని ఒక కమిటీని ఏర్పాటు చేశారు. ప్రతి సంవత్సరం— రచయితలకి నాలుగు బంగారు పతకాల్ని ఈ కమిటీ ద్వారా అందజేయడమే ఆయన ముఖ్యోద్దేశం. నాగేశ్వరరావు ఉదాత్తతకి రచయితలు ఋణపడి వుంటారు. వారి ఉత్సాహమే నాగేశ్వరరావుకి లభించే ఆనందం గనక, రచయితల నుంచి మంచి రచనలు ఆశించ వచ్చు. ఆ రచనల నుంచి మంచి చిత్రాలనూ ఆశించవచ్చు!

### అన్నపూర్ణా డిస్ట్రిబ్యూషన్ సంస్థ

నాగేశ్వరరావు కేవలం నటుడే కాదు, ఒక సంస్థ అన్నా తప్పులేదు. ఆయన కృషికి వివిధ రంగాలు ఉదాహరణలుగా వున్నాయి. ఇప్పుడు తమ శ్రీమతి అన్నపూర్ణ పేరుమీద ఒక డిస్ట్రిబ్యూషన్ సంస్థని కూడా నెలకొల్పినట్టు ప్రకటించారు. చిత్ర పరిశ్రమకి మరో ఆశాకిరణం ఉదయించింది!

### నటించలేని నటుడు

'నేను సినిమాల్లో తియ్యగా మాట్లాడతాను. నిజజీవితంలో సూటిగా మాట్లాడతాను. నిజజీవితంలో నటించడం నా మనస్సుకు విరుద్ధమైనది. అది నాకు చాతకాదు...'

అన్నారు నాగేశ్వరరావు. సంభాషణలో మాటలకందని భావాన్ని వ్యక్తం చేస్తారాయన. ఇది అక్కినేని వ్యక్తిత్వాన్ని పెంచుతుందనడంలో సందేహం లేదు!

అనుభవాలతో మనసు ఎదుగుతున్నది. వయసు కదులుతున్నట్టే తోచదు! వర్చస్సు ఇనుమడిస్తోంది. గ్లామరు వృద్ధి అవుతోంది. అప్పటికీ ఇప్పటికీ పాతికేళ్ళ యువకుడుగానే కనిపిస్తారు నాగేశ్వరరావు. ఇది ఆయన రజితోత్సవ సంవత్సరం. మా బాలెట్‌లో ఉత్తమనటుడుగా వచ్చిన నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావుకు మా అభినందనలు!

—సి. కనకాంబరరాజు ●

# సినిమా

## 'అక్కినేనికి కొత్త నాయిక'

శ్రీమతి శాంతకుమారి దగ్గర్నుండి భారతివరకు అక్కినేనితో హీరోయిన్స్‌గా నటించారు. మీరు చూచి అభిమానించి ఆనందించారు. ఇప్పుడు మీ అభిమాన హీరోకు మరొక కొత్తనాయిక దొరికింది. ఆమె మీకు కొత్తకాదు. ఆమె ఎవరో తెలుసా? 'చుట్టరికాలు' చిత్రంలో వుపనాయిక పాత్ర పోషించిన లక్ష్మి. ఈమెకు నాగేశ్వరరావుతో నాయికగా నటించే అవకాశాన్ని మాధవీ కంబైన్స్ కల్గించారు.

మాధవి కంబైన్స్ నిర్మించనున్న చిత్రానికి శ్రీ తాతినేని రామారావు నిర్దేశకుడు. గుహనాధన్ వ్రాసిన కథకు బొల్లిముంత శివరామకృష్ణ మాటలను



'భలేపాప'లో జ్యోతిలక్ష్మి.

సమకూర్చారు. శ్రీ సుబ్బారావు, ప్రసాద్ గార్లు నిర్మించే యీచిత్రంలోని ప్రధాన పాత్రలను నాగేశ్వరరావు, జగ్గయ్య, గుమ్మడి, పద్మనాభం, అంజలీదేవి, లక్ష్మి పోషిస్తారు. ఈచిత్రానికి సెల్వరాజ్ ఛాయను, జి. వి. సుబ్బారావు శిల్పాన్ని, కె. వి. మహదేవన్ సంగీతాన్ని నిర్వహిస్తారు. మే మాసంలో షూటింగు (అవుట్‌డోర్) కొడైకెనాల్‌లో ప్రారంభమవుతుందని తెలుస్తోంది.

## రామారావుకు కొత్త జోడీ

తెలుగు తెర కథానాయిక లందరితోనూ శ్రీ రామారావు హీరోగా నటించారు. ఇప్పుడు శారద (ఊర్వశి)తో నాయకుడిగా ఒక చిత్రంలో నటిస్తున్నారు. ఈ రిద్దరి కాంబినేషన్ను నవశక్తి పిక్చర్స్ వారి చిత్రంలో చూడవచ్చు. ఈ చిత్రంలోని నాయిక పాత్ర నొకదాన్ని వాణిశ్రీ ధరిస్తోంది.

నవశక్తి పిక్చర్స్ నిర్మిస్తున్న చిత్రానికి శ్రీ సి. ఎస్. రావు దర్శకుడు; నవశక్తి యూనిట్ తయారుచేసిన కథకు ఆరుద్ర సంభాషణలను సమకూర్చారు. శ్రీ గంగాధరరావు నిర్మించే యీ చిత్రంలోని ముఖ్యభూమికలను రామారావు, నాగయ్య, రేలంగి, రమణారెడ్డి, పద్మనాభం, శారద, వాణిశ్రీ, హేమలత, శ్రీరంజని, రావికొండలరావు, ప్రభృతులు ధరిస్తున్నారు. చాలా సంవత్సరాల తర్వాత కమలాకొట్నీస్ ఈచిత్రంలో ఒక ప్రముఖపాత్రను పోషించడం విశేషం. ఒక ప్రధానపాత్రను కొత్తమ్మాయికి యివ్వాలనే వుద్దేశం వున్నట్టుంది. ఈ చిత్రానికి సత్యనారాయణ కెమరాను. సూరన్న శిల్పాన్ని, శంకర్ జైకిషన్లు సంగీత సారధ్యాన్ని నిర్వహిస్తున్నారు. షూటింగు ఏప్రిల్ 1 నుండి ప్రారంభమైంది.

## కథానాయకుని పాత్రలలో చలం

శ్రీ చలం కథానాయకుడిగా వెండితెరకు పరిచయమయ్యాడు. మధ్యలో



ఆంధ్ర ప్రదేశ్ నుంచి రాజ్యసభకి పోటీచేసిన వారిలో మొదటి లెక్కింపులోనే ఎన్నిక అయి ఘన విజయం సాధించిన ఏకైక అభ్యర్థి శ్రీ కాట్రగడ్డ శ్రీనివాసరావుగారు.

కొన్నాళ్ళు హాస్యనటుడిగా ముద్రించబడ్డారు. 'సత్తెకాలపు సత్తెయ్య' 'సంబరాల రాంబాబు' చిత్రాలు విడుదలై ప్రేక్షకుల ఆదరణాభిమానాన్ని సంపాదించుకున్నారు. ఇప్పుడు చలం నాల్గయిదు చిత్రాల్లో కథానాయకుని పాత్రలను పోషిస్తున్నారు.

కల్పనా చిత్ర నిర్మించనున్న 'సోమరిపోతు' చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు; చలం నాయకుడు. ఈ చిత్రానికి భమిడిపాటి మాటలను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని సమకూరుస్తున్నారు. శ్రీ బాబూరావు నిర్మించే ఈ చిత్రంలోని ముఖ్యపాత్రలను_రాజబాబు, అల్లు రామలింగయ్య, విజయలలిత, ఛాయాదేవి పోషిస్తారు. నాయిక పాత్రకు కొత్త తారను పెట్టగలరని తెలుస్తోంది. మే 15 న షూటింగు జరుగనున్న ఈ చిత్రానికి కె. ఎస్. ప్రసాద్ ఛాయాగ్రహణాన్ని, శ్రీహరిరావు కూర్పును నిర్వహిస్తారు.

* * *

శ్రీ తోట సుబ్బారావు నిర్మించనున్న చిత్రంలోకూడా చలం కథానాయక పాత్రను పోషిస్తారట. 'పిచ్చాడి పెళ్ళం'లో చలం హీరో; శ్రీ రమణ చిత్రవారి 'మట్టిలో మాణిక్యం'లో చలం ముఖ్యపాత్రను పోషించగలరట. మొత్తానికి యిది చలం సీజన్ అనే చెప్పాలి.

## తల్లిదండ్రుల బాధ్యత

పిల్లలపై అనురాగం కన్నతల్లికి ఎంత వుంటుందో, తండ్రికి కూడా అంతే వుంటుంది. తమ బిడ్డలు వంశోద్ధారకులు కావాలనే కోరిక తల్లి+తండ్రికి సమానంగానే వుంటుంది. సంసారాన్ని తీర్చి దిద్దడానికి తల్లితండ్రు లిద్దరూ అవసరం అనెడి సత్యాన్ని నిరూపించే కథాంశమే రామవిజేత ఫిలింస్ నిర్మించనున్న 'తల్లితండ్రులు' చిత్ర సారాంశమని తెలుస్తోంది.

ఉదాత్తమయిన తల్లి తండ్రులుగా సావిత్రి, జగ్గయ్యగార్లు నటించే ఈ చిత్రాన్ని బాబూరావు డైరెక్టు చేస్తారు. ఏప్రిల్ 7 న ప్రారంభం కానున్న ఈ చిత్రానికి పినిసెట్టి మాటలను, ఘంటసాల సంగీతాన్ని, ఖులేఖురే ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తారు. శ్రీ కె. ప్రభాకర్ నిర్మిస్తున్న 'తల్లితండ్రులు' చిత్రంలోని ప్రధాన పాత్రలను శోభన్‌బాబు, రేలంగి, వాణిశ్రీ, విజయలలిత, నాగయ్య, శ్రీరంజని మరియు హరనాథ్ పోషిస్తున్నారు.

* * *

మార్చి 25 న రెండు చిత్రాల షూటింగు కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. ఒకటి పౌరాణికం; మరొకటి సాంఘికం. పౌరాణికానికి శ్రీ కామేశ్వరరావు దర్శకుడు; సాంఘికానికి శ్రీ కె. ఎస్. ప్రకాశరావు నిర్దేశకుడు; రెండింటికీ పెండ్యాల సంగీత సారథి.

* * *

శ్రీ ఎం. ఎస్. రెడ్డి భారీ ఎత్తున నిర్మిస్తున్న 'శ్రీ కృష్ణ విజయం' ప్రసాద్ స్టుడియోలో మార్చి 25 న



'అగ్ని పరీక్ష'లో బేబి శ్రీదేవి, కృష్ణ.



'పసిడిమనసులు'లో పద్మాంజలి, శోభన్‌బాబు, శారద;

ప్రారంభమైంది. తెలుగు చలనచిత్ర పరిశ్రమలోని అతిరథ మహారథులందరూ వచ్చి, రెడ్డిగారిని అభినందించి, చిత్రం విజయవంతం కావాలని ఆశీర్వదించారు. చాలాకాలం తర్వాత శ్రీ రామారావు శ్రీకృష్ణ పాత్రను నిర్వహిస్తున్నారు; ఈ పాత్ర అనితరసాధ్యంగా వుండేట్టు శ్రీ రామారావు నటించడానికి నిశ్చ

## సినిమా

యించారు మల్లెమాల వ్రాసిన కథకు, పింగళి మాటలను సమకూర్చారు చిత్రంలోని ప్రధాన పాత్రలను శ్రీయుతులు రామారావు, ఎస్వీ రంగారావు, జగ్గయ్య (గెస్టు) కాంతారావు, నాగభూషణం, పద్మనాభం, రామకృష్ణ, సత్యనారాయణ, జయలలిత, దేవిక మరియు జమున పోషిస్తున్నారు. ఏప్రిల్ 2న హేమమాలిని నృత్యాన్ని పిక్చరైజ్ చేస్తారు. మార్చి 18న విజయా గార్డెన్స్‌లో పాటల రికార్డింగు ప్రారంభమైంది. 'శ్రీ కృష్ణవిజయం' చిత్రానికి కామేశ్వరరావు దర్శకత్వాన్ని, పెండ్యాల సంగీతాన్ని, జి. కె. రాము ఛాయాగ్రహణాన్ని గోఖలే శిల్పాన్ని నిర్వహిస్తున్నారు.

* * *

శ్రీ వై. కన్నయ్య సమర్పించే ఎస్. బి. ఆర్. పిక్చర్స్ వారి షూటింగు మార్చి 25న ఏ. వి. ఎం. లో ప్రారంభ



'[illegible]'లో విజయనిర్మల

మైంది. శ్రీ [illegible] దర్శకత్వంలో తయారయ్యే ఈ చిత్రంలోని ప్రధానపాత్రలను జగ్గయ్య, శోభన్‌బాబు, రేలంగి, రాజబాబు, అల్లురామలింగయ్య, భారతి, మణిమాల, రమాప్రభ, ఛాయాదేవి పోషిస్తున్నారు. శ్రీ ఎస్. భాస్కరరావు నిర్మిస్తున్న ఈ సాంఘిక చిత్రానికి పెండ్యాల సంగీతాన్ని, ఎం. కె. రాజ ఛాయను, కుమార్ శిల్పాన్ని, గోపాలం కూర్పును నిర్వహిస్తారు.

—శ్రీనివాస్

## సినిమా డైరీ

● కౌముది ఆర్ట్సు పిక్చర్స్‌వారి "శ్రీకృష్ణ విజయం" మార్చి 25న ప్రసాద్ స్టుడియోలో ప్రారంభమైంది. 25, 26, 27 తేదుల్లో జరిగిన షూటింగులో శ్రీ రామారావు, జమున దేవిక, మిక్కిలినేని, అల్లురామలింగయ్య పాల్గొన్నారు. శ్రీ ఎం. ఎస్. రెడ్డి నిర్మిస్తున్న యీ చిత్రానికి శ్రీ కామేశ్వరరావు దర్శకుడు.

● రవీంద్రా ఆర్ట్సు పిక్చర్స్‌వారి "ధర్మదాత" షూటింగు మార్చి 23న మద్రాసులోని ఒక హౌస్‌లో జరిగింది. శ్రీ అక్కినేని పాల్గొన్న సన్నివేశాన్ని శ్రీ సంజీవి డైరెక్టు చేసారు.

● శ్రీ పద్మాలయా మూవీస్‌వారి "అగ్నిపరీక్ష" షూటింగు ప్రసాద్ స్టుడియోలో మార్చి 23 నుండి 30 వరకు జరిగింది. శ్రీ వరప్రసాదరావు దర్శకత్వంలో కృష్ణ, పద్మనాభం, రాజబాబు, విజయనిర్మల, రాధాకుమారి, వెంకన్నబాబు పాల్గొన్నారు.

● గౌతమీ పిక్చర్స్‌వారి "ఆలీబాబా నలభైదొంగలు" ప్రవీణా ఆర్ట్సు పిక్చర్స్ "పెళ్ళిసంబంధం" చిత్రాలకి రికార్డింగు పూర్తయింది.

● ఫల్గుణా పిక్చర్స్‌వారి "జగజ్జెట్టీలు" షూటింగు 21, 22 తేదుల్లో విజయా గార్డెన్స్‌లో జరిగింది. శ్రీ నందనరావు నిర్దేశకత్వంలో వాణిశ్రీ, శోభన్‌బాబు, రాజబాబులు పాల్గొన్నారు.

● "పెళ్ళిసంబంధం" ఏప్రిల్ 2న, "ఆలీబాబానలభైదొంగలు" ఏప్రిల్ 4న "మరోప్రపంచం" ఏప్రిల్ 10న, "పెళ్ళికూతురు" ఏప్రిల్ 17న 'పెత్తందార్లు" ఏప్రిల్ 23న, "మాయని మమత" మే 1న విడుదల కాగలవని తెలుస్తోంది.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad.

